గౌతమ

# మేడిపళ్లు






సర్వోదయ ప్రచురణ

సర్వోదయ ప్రచురణలు

నరసరావుపేట


*

ముఖచిత్రం

దాసరి వీరయ్య

*

జె. బి. ప్రీస్ట్లీ రచించిన "Inspector Calls" అను నాటకమునకు అనుసరణ.

ఇందులోని పాత్రలు, సంఘటనలు కేవలం కల్పితములు,



*


వెయ్యి ప్రతులు

తొలి ముద్రణం

జులై 1950.

సర్వోదయ ప్రెస్, నరసరావుపేట.


[redacted]

# ప్రవేశిక

మానవ చరిత్రలో ప్రతియుగం ఉత్తమ సాహిత్యోద్భావనకు అర్హమైనదే. ముఖ్యంగా, నాటక సాహిత్యం స్వభావ, సంవిధానాలలో వాస్తవ జీవితానికి అతి సన్నిహితమైనది. అగాధమై, అతి క్లిష్టమైన నేటి జీవితంలో సంఘర్షణ నిహితమై వున్నది. నాటకానికి ప్రాణం సంఘర్షణ.

ఆంధ్ర నాటకరంగంలో పౌరాణికయుగం వాస్తవ జీవితపు టొత్తిడికి తాళ లేక నీరసించి, నిష్క్రమించింది. సాంఘికయుగం ప్రవేసించింది. మనజీవితంలోని వేదన, విలాసం, సంఘర్షణ, సంతోషం ఒక్కసారిగా పొంగెత్తి రంగస్థలాన్నాక్రమించాలి. ప్రపంచ ప్రసిద్ధ నాటకరీతులు ఆంధ్రసాహిత్యంలో సమ్మిళితమై, మానవ జీవితంలో ఆంధ్రవ్యక్తి విశిష్టతను నిర్వచించాలి.

ఆంధ్ర నాటక కర్తలు విప్లవాత్మకమైన నేటి జీవితాన్ని ఆకళింపు చేసుకొని, తమ రచనలలో ఈ యుగ ధర్మాన్ననుసరించి కొత్తసృష్టికి యత్నిస్తున్నారు. ప్రఖ్యాత పాశ్చాత్య నాటకాలను ఆంధ్ర జీవితాని కనుగుణంగా తీర్చి దిద్ది, ప్రదర్శిస్తున్నారు. ఆంధ్ర సాహిత్య మహా ప్రస్థానంలో ఇది మొదటి మజిలీ.

" మేడిపళ్లు " రచనకు ప్రఖ్యాత ఆంగ్ల గ్రంథకర్త జె. బి. ప్రీస్ట్లీ రచించిన "ఇన్‌స్పెక్టర్ కాల్స్" అను నాటకం మాతృక. ఈనాటకం మాస్కోనుండి వాషింగ్టన్ వరకు అనేక దేశాలలో నిర్విరామంగా ప్రదర్శింపబడి, ప్రసిద్ధి పొందింది. దీనిలోని విశిష్ట గుణాలే ఈ విజయానికి కారణం. సాంఘిక జీవిత చిత్రణలో ఈ గ్రంథకర్త ఒక నవీనమార్గం దర్శించాడు. పూర్వం లాగ బాహాబాహీ యుద్ధాలు, ఉద్రిక్త ప్రణయం, హావభావ ప్రదర్శన నేటి జీవితంలో కన్పించవు. ఇందుకు మూలమైన ఉద్వేగం ప్రతి హృదయములో గుప్తంగా వుంటుంది. మానవుల పరస్పర సంబంధాలలో కన్పించే ద్వేష భయాలు, ప్రేమ గౌరవాలు నేడు, మర్యాద మరుగున అజ్ఞాతంగా దాగుతున్నాయి. పూర్వం బాహాటంగా వెల్లడి అయ్యే జంతు తత్వం, నేడువీధిలో, ఆఫీసులో, హాలులో అతి సాఫీగా, చిత్ర చిత్ర గతులలో వ్యక్తమాతోంది. ఈ తెర మరుగును తొలగించి వ్యక్తులు సంఘంపట్ల చేసే దౌష్ట్యం, దుండగం ప్రకటించడానికి సంఘాన్నే ఒక అమాయిక స్త్రీ మూర్తిగా చిత్రిస్తాడు ర యిత. ఈ అపరాధ సహస్రాలను భరించలేక ఆ ఆత్మహత్య చేసుకొంటుంది. స్వాతంత్ర్యం పేరుతో విలాసంగా - వెళ్ళబుచ్చుతున్న ఒక "గౌరవ" కుటుంబంలో హఠాత్తుగా ఒక సి. ఐ. డి. ఇన్‌స్పెక్టరు ప్రవేసించి వారి దొంగమర్యాదను, ల్పితహోదా కుహనా గౌరవాన్ని చీల్చివేసి, వారి నిత్య జీవితం ఎంత అపరాధభూయిష్టమో నిరూపిస్తాడు.

శ్రీ గౌతమ ఈ నాటకాన్ని ఆంధ్ర జీవితాని కనుగుణంగా మలిచి, రచించారు. వీరికి ప్రాచ్య, పాశ్చాత్య నాటక సాహిత్యాలతోనే గాక, ఆంధ్ర నాటక రంగంతో కూడా కొన్ని సంవత్సరాలనుండి సన్నిహిత సంబంధంవుంది. వీరు, పత్రికలలో ప్రకటించిన అనేక కథలు, వ్యంగ్యరచనల ద్వారా ఆంధ్ర పాఠకులకు సుపరిచితులు. విశేషించి, వీరు నటులు కావడం నాటక రచనకు ఎంతో తోడ్పడింది.

ఈ నాటకం చదివిన ప్రతి వాళ్ళకీ మొదట స్ఫురించే భావం ఒకటే! నేనుకూడా క్షణక్షణం ఏదో అపరాధంచేస్తున్నానా? చెయ్యనట్లు నటిస్తున్నానా? ఈద్వంద్వ జీవితం దుస్సహం! ఈ వ్యవస్థలో నిష్కల్మషంగా, నిరపరాధంగా, బ్రతికే అవకాశం లేదా?

చదవండి! మీరుమరిచిపోయిన దిగుళ్ళుజ్ఞాపకంవస్తాయి. చేసిన అపరాధాలు వేధిస్తాయి. మీకు ఎవరి మీద అయినా నిర్లక్ష్యం, ద్వేషం, భయం వుంటే (లేవూ?) ఈ నాటకం ఆత్మశోధనకు పురిగొల్పుతుంది. అంతరాత్మను అభిషేకిస్తుంది.

అంతకంటె ఏం కావాలి?



అనిసెట్టి సుబ్బారావు



| | |
|---|---|
| జమీందారు | వేములవాడ శివరామప్రసాద్ |
| జమీందారిణి | పద్మావతీదేవి |
| కుమారుడు | మోహన్ |
| కుమార్తె | సుశీల |
| సుశీల కానున్నభర్త | వాసుదేవరావు |
| సేవకుడు | సీతయ్య |
| సి. ఐ. డి. ఇన్‌స్పెక్టర్ | |



# ఒకటో దృశ్యం

[జమీందారు భవనంలో విశాలమైనహాలు. సోఫాలు, కుర్చీలు. విశాలమైన టేబిలుమీద ఫ్లవర్ వేస్, విందుకు అవసరమైనగ్లాసులు, ప్లేట్లుమొదలైనవి–ఒకమూల టెలిఫోన్ వుంటాయి. వెనుకగోడకు జమీందారుపూర్వుల వర్ణచిత్రాలు, ఒకటి రెండు పులిచర్మాలు అమర్చివుంటాయి.

భారత స్వాతంత్ర్య ప్రథమ వార్షికోత్సవంనాటి సా ... లం.

జమీందారు, అతనిభార్య, కొడుకు, కూతురు, వాసుదేవరావు, విందు చేసుకుంటున్నారు. కులాసాగా కబుర్లుచెప్పుకుంటూ పెద్దగానవ్వుకుంటున్నారు.]

ప్రసాద్ : అసలు వాణ్ణెలా ఒదిలించుకున్నావు ?

వాసు : వాడు బయటికి వెళ్ళేసరికి నాతలప్రాణం తోకకొచ్చింది.

సుశీల : వీళ్ళకి ఏమాత్రం చనువిచ్చినా జలగల్లాగ పట్టుకొని వదలరు.

వాసు : (సీరియస్ గా) వచ్చిన దగ్గరనుంచి "సంఘం పాడైపోతోంది. ఈదురాచారాలన్నీ నిర్మూలించి సంఘాన్ని కాపాడటం మన బాధ్యత, మనవిధి, మనకర్తవ్యం" అంటూ ఉపన్యాసం దంచుతాడేకాని వచ్చిన సంగతేమిటో చెప్పడు. ఆఖరుకి విసుగెత్తి నాలుగు ముక్కల్లో తేల్చవయ్యాఅంటే అప్పుడు ప్రారంభించాడు.

పద్మ : ఏమని ?

వాసు : దేవదాసి సముద్ధరణనిధికి విరాళాలు కావాలట ?

ప్రసాద్ : జమీందార్లకు చేతనయింది విరాళాలే అనిగామాలు వాళ్ళఉద్దేశం.

మోహన్ : ఏమినిధి ?

వాసు : దేవదాసి సముద్ధరణనిధికట – ఈనిధితో వాళ్ళేంచేస్తారంటారేమో ! భోగంవాళ్ళు తమజీవితం మార్చుకోవాలని

ప్రచారంచేసి వాళ్ళకుపెళ్ళిళ్లు చేస్తారట. నాకుఒళ్ళు మండింది చెప్పొద్దూ! భోగంవాళ్లేమిటి? పెళ్లిళ్లేమిటి? ఏమైనాఅర్థంవుందా?

ప్రసాద్ : పనీపాట లేనివైధవ్యానికి ఎలావ్వాసు పోతుంది సరి!

వాసు : సంఘాన్ని విచ్ఛిన్నంచేసే ఇలాంటి ఉద్యమాలకి ఒక్కదాగి దమ్మిడీయివ్వనని ఖచ్చితంగా చెప్పేసేను. అదీకాక యికముందెప్పుడయినా ఇలాంటి చందాలకి నాదగ్గరకొచ్చి పిచ్చికూతలుకూస్తే న్యూసెన్సు కేసుపెట్టిస్తానని బెదిరించేసరికి వెర్రిముఖంవేసి అదేపోవడం!

మోహన్ : (విసుగ్గా) అవన్నీ మనకెందుకండీ! ఇవ్వదలచుకుంటే ఎంతో కొంత విరాళం ఇవ్వటం. లేకపోతే వీల్లేదని చెప్పడం. (తన మాటలు ఎవరికీ రుచించలేదని గ్రహించి పత్రికతీసుకొని నిశ్శబ్దంగా చదువుకోవడం మొదలెడతాడు. జమీందారు కోపంగా ఇతని వంకచూసి వాసుదేవరావుతో సంభాషణ సాగిస్తాడు.)

ప్రసాద్ : అలా ఏదో గట్టి మంత్రం వేస్తేనేగాని యీ దయ్యాలు ఒకంతట వదలవు!

[సీతయ్య ప్రవేశం ట్రేలోషర్బత్తు జగ్గు, గ్లాసులు టేబిల్ మీదపేర్చి వెళ్ళిపోతాడు]

ప్రసాద్ : (సీరియస్‌గా) ఇవాళ స్వాతంత్ర్య దినోత్సవంకదూ! ఒక స్పెషలు మొగలాయిషర్బత్తు చేయించానోయి! ఒకచుక్క తగిలితే స్వర్గానికెత్తేస్తుంది...మనప్రాంతాల్లో యీషర్బత్తురుచి చూసినవాళ్లు నూటికి కోటికి ఒకరుంటారేమో...అసలు లేరసే నాఉద్దేశం –

[జగ్గులోనుంచి షర్బత్తు అందరిగ్లాసుల్లోకి పోస్తాడు, అందరూరుచి చూసి ఆనందంగా తాగుతుంటారు, పద్మావతిమాత్రం వాసనచూచి అక్కడే వుంచేస్తుంది.]

వాసు : (రుచిచూసి) ఒహోహో! ఏమిహాయి! అమోఘంగాఉంది.

ఇది తయారు చేసిందెవరండి?

ప్రసాద్: ఎవరన్నా అయితే యిలాచేయగలరా? నేనుదగ్గరుండి చేయించానోయి. ఏం సుసీ బాగుందా?

సుశీల: చాలాబాగుంది! అమ్మా, నీవుతాగవేం!

పద్మ: ఒంట్లో అదొళకమాదిరిగవుంది ఎంచేతోగాని —

సుశీల: ఒక్కసారి చూడడానికేం? చాల బాగుంది!

[పద్మావతి ఒకగుక్కెడు తాగుతుంది. రుచి సహించక పోగానే అక్కడే వుంచేస్తుంది.]

ప్రసాద్: రాంపూర్ నవాబుకొడుకు పెళ్ళికి విందుచేశారు. అక్కడ తాగాను యీషర్బత్తు. అప్పటినుంచి ఆరుచిమరిచిపోదామన్నా మరుపుకిరాదు. యీనవాబులున్నా రేమహారసికులు. ఏమిదర్జా ఏంహుందా! ఒహోహో! అదీజీవితమంటే! ఆకాశ్మీరు తివాసీలు, ఆనగిషీపళ్లేలు, ఆరంగురంగులలైట్లు, వడ్డించే ఆస్త్రీ పరివారం! అదంతాచూస్తుంటే ఏదేవలోకమో అనిపిస్తుంది. (ఆతలంపులో తన్మయత్వంపొంది) ఆవిందులో నెమలిమాంసం వండేరుకదా, ఒహో! అదిమాంసమా? వట్టివెన్నకదు టోయి! నోట్లోపెడితే యిట్టే కరిగిపోయేది.........

సుశీల: పోనిద్దురు నాన్నగారు, భోజనం కబుర్లంటే ఒళ్లు తెలియదు మీకు. చివరికి వాసుకూడ మీలాగే తయారవుతాడేమో నని భయం వేస్తుంది.

పద్మ: ఏం! సంతోషించవలసిందే! అంతకంటే కావలసిందేముంది?

సుశీల: సంతోషించాంలె? యీఒక్కటే అయితే సంతోషమే! కాని, యీమధ్య నాన్నగారిలాగే యీయనకూడా సెలల తరబడి కంటికి కనబడకుండ మాయమవడం నేర్చుకున్నాడు.

పద్మ: అదెప్పటినుంచి?

సుశీల: మొన్న వేసవికాలం మూణ్ణెల్లు యీయన నే రాచకార్యం చేస్తూ ఎక్కడున్నాడో చెప్పండి?

వాసు : (తడబడుతూ) అప్పుడు నాకు చాల పనులొచ్చిపడ్డాయ్ సుశీ! ఊపిరి తియ్యడానికిగూడా తీరిక వుండేదికాదు.
సుశీ : నీవెలాగోలాగు సమర్థించుకోగలవులే !
వాసు : సమర్థించుకోవడమెందుకు ? నీకు చెపితే బోధపడదు.
పద్మ: పోనిద్దు సుశీ! మగవాండ్లయిన తరువాత అనేకపనులుంటాయ్. మూణ్ణెల్లు కనుపడకపోతే, మరేం కొంప మునిగిపోదులే ! యిప్పుడు వాసునేమీ ఆందోళనపెట్టకు !
సుశీల : [illegible] వాసు ! ఇప్పుడే చెపుతున్నాన్నూ. అలా వున్నట్టుండి [illegible] ఏవుతూ వుండడం నాకేమీనచ్చదు. పోనీ ఆ రాచ కార్యమేమిటో చెప్పి వెళ్ళకూడదూ ?
వాసు : సరే ! అలాగే, నీ ఆజ్ఞ ! నీవు చెపితే కాదంటానా ? ఈ సారికి క్షమించు.
సుశీల : అదే మీలో వుండే దుర్గుణం. సమయం వస్తే తియ్యగ మాట్లాడతారు. సమయం తీరగానే మళ్ళీ మీదారిమీదే !
వాసు : పోనీలే, నీకంత నమ్మకం లేకపోతే యింతవరకు నేను చేసిన పాపానికి పరిహారంగా ఏం చెయ్యమంటావో చెప్పు ! (అంటూ జేబులోనుంచి ఏదో తియ్యడానికి ప్రయత్నిస్తూ వుంటాడు.)
సుశీల : నీవేమి చేయనక్కరలేదు. సంతోషించాంకాని; ఇక ముం దైనా ఆజేబులు కాస్త పెద్దవి కుట్టించుకోవాలు!
వాసు : ఏమీ చెయ్యకపోవడం ఏమిటి ? ఆపాపానికి పరిహారంగా, నేను చేసిన ఘోర తపస్సు ఫలించి ఎలా ప్రసన్నమయిందో చూడు ! (జేబులోనుంచి ఒక పెట్టెతీసి ఉంగరంచూపుతాడు.)
సుశీల : (ఆతురతతో తీసుకుంటూ) అమ్మదొంగా ! అమ్మా చూశావా ఈఉంగరం. యీ డిజైనుచూడు ! ఎంత బాగుందో ! చూశారా నాన్నగారూ !
ప్రసాద్ : అవునమ్మా చ్చాల చక్కగాఉంది.
[illegible]శీల : ఈ రాళ్ళవరుస చూచారా? ఎంత తమాషాగా అమర్చారో! (వేలుకు పెట్టుకోబోతుంది)

వాసు : ఆగుసుశీలా, ఆగు. నేనింతకాలం ఘోరతపస్సు చేస్తే ఆశాస్తఫలం నాకు దక్కకుండా చేయడం నీకు న్యాయమేనా?

సుశీల : సరే!ఆఫలమేదో నువ్వే తీసుకో. (ఉంగరం ఇచ్చేస్తుంది వాసు ఆ ఉంగరం సుశీల వేలికి సున్నితంగా అమరుస్తాడు. ప్రేమతో ఒకరికళ్లల్లో ఒకరు చూచుకుంటారు. జమీందారు, అతని భార్య మనస్సులలో సంతోషిస్తారు కాని, పైటికివెలిబుచ్చరు)

పద్మ : ఎక్కడ చేయించావ్ వాసూ ఆ ఉంగరం?

వాసు : లండన్ నుంచి నాన్నగారు పంపించారు.

ప్రసాద్ : ఈసందడిలో సర్బత్తు గుర్తించే మర్చిపోయాం. (గ్లాసులలో పోస్తూ) ఊ! కానీయండి. (అందరూ తాగుతుంటారు.) కానీ, మీనాన్నగారూ, అమ్మగారూ సరీగ్గా ఆగస్టు పదిహేనుకే వేళంలో లేకపోవడం చాల దురదృష్టం. దేశంలో ఎక్కడ చూచినా పచ్చటి తోరణాలతో ఉత్సవాలు చేసుకుంటూంటే వారిద్దరు విదేశాల పాలవడం చాలా అన్యాయం.

వాసు : ఈ వేళకు సరిగ్గా ఎలాగైనా ఇంటికిచేరుకుందామని చాల ప్రయత్నంచేశారు. కాని, వీలైందికాదు. ఇంగ్లండులో పని ముగించుకొని బయల్దేరేసమయానికి, ఒకఅమెరికన్ ప్లాస్టిక్స్ కార్పొరేషన్ ఏదోమాట్లాడటానికి తక్షణం అమెరికారావల సిందని కేబుల్ చేసింది. వెళ్ళకతప్పిందికాదట.

ప్రసాద్ : మీనాన్నగారేదో కొత్తఫ్యాక్టరీ కట్టామన్నారుగదూ!

వాసు : అదే! ఆ ప్లాస్టిక్స్ కార్పొరేషనే. మనదేశంలో ఒకఎల క్ట్రికల్ గూడ్సుఫ్యాక్టరీ కట్టారట. సగంపెట్టుబడి వాళ్లది. సగంమనది. ఆవిషయాలు తేల్చుకోడానికే అమెరికా వెళ్లారు.

ప్రసాద్ : చూచావా! అమెరికా మనకెన్నివిధాల సహాయము చేయాలని ఆపత్రయపడుతోందో? ఒక్కపది సంవత్సరాలు అమెరికాకు నిరాఘాటంగా అవకాశమిస్తే మనదేశాన్నికూడా ఒక భూతల స్వర్గంచేసి పారేయగలదు. కాని ఏంలాభం? మన గవర్నమెంటుకు ఆదూర దృష్టి అంటూ ఒకటుంటేనా! ప్రతి

దానికిఅడ్డం (విసుగ్గా) ప్రతిదానికీనూ !

వాసు : మనగవర్నమెంటును అలాకొట్టిపారేయకండి! వాళ్లకొచ్చిన సమస్యలన్నీ అడకత్తెరలాంటివి. కొట్టుకుంటున్నారు పాపం! ఏదీ; స్వాతంత్ర్యము వచ్చి పట్టుమని ఒక్క సంవత్సరం నిండ లేదు. ఒకజాతి జీవితంలో అదేమాత్రం, ఒక్క క్షణమన్న మాట. యీ క్షణంలోనే చూడు, ఎన్ని విషమ సమస్య లొచ్చాయో; కాందిశీకులు, సంస్థానాలు, హైదరాబాదు - ఎన్నని చూచుకోగలరు పాపం! కాని, ఎన్ని ప్రమాదాలు వచ్చినా వాళ్లుమాత్రం సమగ్రమైన వాస్తవిక దృష్టితోనే అన్ని సమస్యల్ని ఎదుర్కొంటున్నారు. ప్రతి విషయంలోనూ ఎవరూ ఎక్కువ నష్ట పోకుండా, ఎవరికీ ఎక్కువ కష్ట లేకుండా, అందరికీ కాస్తో, కూస్తో లాభకరంగానే పోనిస్తున్నారు. మీరలా అంటారు గాని మన జమీందారీ బిల్లు ఎంత చాక చక్యంగా నడిపించారో చూడండి—

పద్మ : (విసుగ్గాలేచి) ఇక మీరు రాజకీయాల ధోరణిలో పడ్తే ఒకంతట తేరుకోరు. మా కెందుకీగొడవలన్నీ మేం పోతాం.

ప్రసాద్ : ఉండండి! యీ రోజుల్లో ఆడవాళ్లకవసరములేని రాజకీయాలంటూ ఉన్నాయా? అందులో మన జమీందారీ బిల్లు.

పద్మ : ఎందుకు? ఎప్పుడూ ఆఖరికి నింగిలేపాట ఆబక్కటేగదూ? జమీందారీబిల్లు; జమీందారీబిల్లు! ఆ బిల్లుకైనా సిగ్గుండాలి, మనకైనాసిగ్గుండాలి; పోనిద్దురూ! మాకెందుకీ తర్జనభర్జనలు. మేంపోతాం. (తల్లి, కూతురు లేచి వెళ్ళిపోతారు. గుమ్మంవద్ద వెనుకకు తిరిగి) మోహన్ ఇలా ఒకసారి రావనుంది.

[మోహన్ అంతవరకూ చదువుతూన్న పత్రిక మూసేసి, వారి ననుసరిస్తాడు]

ప్రసాద్ : మర్చ త్తింకా మిగిలిపోయినట్లుంది. మరో గ్లాసు తాగువానూ?

వాసు : థ్యాంక్స్. ఇక లాభంలేదు.

ప్రసాద్ : [గ్లాసులలో పోసుకొని తాగుతూ] రుచికి తగినంత అభి రుచి లేకపోతే ఎలాగోయ్! మళ్ళీ దీన్ని తయారు చెయ్యా లంటే ఎంత శ్రమో తెలుసా!

[కొంత నిశ్శబ్దం. కొంతవ్యవధి – ప్రసాద్ సిగర్ తీస్తాడు. వాసు సిగరెట్ తీసి లైటు వెలిగించి ముందు సిగర్ వెలిగిస్తాడు.]

ప్రసాద్ : థ్యాంక్స్. (తీరిగ్గా కుర్చీ వెనక్కువాలి పొగపీలుస్తూ) మీతల్లిగారికి సుశీలంటే మహాఅభిమానం. కాని తన కొడుక్కి ఇంతకంటే పెద్దసంబంధం చెయ్యాలని అనుకొంటుందేమో! (వాసు కొంత తత్తరపడుతూ, అనంగీకార సూచకంగా ఏదో అనటంచూచి) అబ్బే! మరేంలేదు వాసూ, ఆమెను ఏమీ అనలేము. కోరిక ఉండడం ఏతల్లికైనా సహజం. పెద్దవంశంలో పుట్టారు. అందుచేతనే ఆపైచూపు. కాని నాకు కూడా యీమధ్య అయాచితంగా కొంతసిరిసంపదకూడే సూచనలు కను పించాయ్. రెండు మూడు నెలల్లో మరో పంచదార ఫ్యాక్టరీ కట్టించబోతున్నా. అంతేగాదు – వచ్చే ఎలక్షన్లలో పార్ల మెంటుకి కాంగ్రెస్ అభ్యర్థిగా నన్ను నిలబెట్టడం తప్పక జరుగు తోంది. కాని ఈవిషయం ఎక్కడా పొక్కనియ్యొద్దు సుమా! బాగుండదు.

వాసు : ఈవిషయం మాఅమ్మగారికి తెలుస్తే చాల సంతోషిస్తారు.

ప్రసాద్ : ఈ జమీందారీ చట్టంరూల్సు ప్రకారం మనకెంత నష్టపరి హారం వస్తుందో తెలుసా? పాతికలక్షలు—పాతికలక్షల రొఖ్ఖం, ఒకవందెకరాలమాగాణీ. ఎంత బ్లాక్ మార్కెట్ చేస్తే మాత్రం, ఎన్ని అమెరికన్ కంపెనీలు దిగుమతిచేస్తేమాత్రం ఇంతకంటే సంపాదించే వాడెవడోయ్? ఒకవెలుగువెలిగిస్తాం–

వాసు : అదేపొరపాటు? ఏదో మిగిలిందే చాలునని వెనక్కుచేరబడి జల్సాగాఖర్చుపెడదామనుకోవటం దేశానికిచాలాఅన్యాయం.

అటువంటి జల్సాలన్నీ మనపూర్వులకు తగినవి కాని మనకు ధర్మం కాదు ! మనకు దేశంపట్ల ఒకగొప్ప బాధ్యతఉంది. దేశంలో యీనాడు ప్రతివస్తువుకీ కరువేగదా? ఇలాంటి ఆపత్సమయంలో మనం ప్రాను ని ప్రతివస్తువును సమృద్ధిగా ఉత్ప చేయాలి. కొత్త కొత్త కర్మాగారాలు నెలకొల్పాలి. మన యాగధర్మాన్ని మనం ని స్తరించాలి. లాభాలొస్తాయిగదా

ప్రసాద్ : ఏమోనాకేం ధైర్యం రాగాని కొత్తపరిశ్రమలు పెడదామన్నా భయమే ! ఉండి ఉండి యీ నాయకులలో ఎవరో ఒకరు దేశాన్నంతా నేషనలైజ్ చేస్తామని బెదిరిస్తుంటారు. పోనీ, నువ్వన్నట్టు ప్రచారంకోసమే అనుకుందాం...ఒక వేళ నిజంగాచేస్తే ఇంకేముంది !

వాసు : అలా ఎప్పుడూ జరుగదు. యీ చిన్న చిన్న వ్యాపారస్థుల ప్రజల్ని తిప్పలు పెడ్తూంటే వాళ్లను సముదాయించడాని అలా అంటుంటారు. ప్రభుత్వం చెప్పినవన్నీ చేస్తే ఇంకేమైనా వుందా ? నామటుకు నేను ప్రభుత్వానికి ఒకటే సలహా ఇస్తాను పరిశ్రమ లన్నీ అభివృద్ధి పొందాక తప్పకుండా నేషనలైజ్ చేయండి. కాని జమీందారీ బిల్లులాగే పరిహారం ఏర్పాటు చేయాల్సిందే ! ఇప్పుడే నేషనలైజ్ ఎందుకు చేస్తారండీ. వాళ్లకుమాత్రం తెలియదూ. వాళ్లది వాస్తవిక దృష్టి అన్నాను గదూ.

[ మోహన ప్రవేశము ]

ప్రసాద్ : వాళ్లేం చేస్తున్నారు మోహన ?

మోహన : [ ఒక గ్లాసు షర్బత్ పోసుకుని ] లోపలకు వెళ్లారో, లేదో! చీరెలు, నగలు, ఇవే కబుర్లు. అదే పెద్ద చర్చ జరుగుతోంది. ఇలాంటి సంభాషణల్లో వాళ్ల ఆవేశకావేషాలు చూస్తుంటే, పాపం వాళ్లు బట్టలకీ, బంగారానికీ మొహం వాచివున్నారేమో అనిపిస్తుంది. మంచిచీరలుంటే ఒళ్ళుమరచి పోతారు.

ప్రసాద్ : అవునోయ్. నీవొక్కసంగతి మరిచిపోతున్నావ్. మన ఆడవాళ్లకు బట్టలంటే ఒంటికి చుట్టుకోడానికి ఏవో పనికి మాలిన గుడ్డలుకావు. బట్టలు వాళ్ల హోదాకు, ఆత్మగౌర వానికి చిహ్నాలు.

మోహన్ : (వెగటుగా) ఇక సాధారణంగా బట్టలుకట్టుకునే వాళ్లల్లో ఆత్మగౌరవం లేదనేనా మీ ఉద్దేశం.

ప్రసాద్ : (కోపంతో లేచి) వాళ్లకీ ఉండొచ్చు. ఎందుకుండగూడదు? ఇదేనీకొచ్చినరోగం. యీధోరణినీలో బాగాజీర్ణించిపోతోంది జాగ్రత్త! తక్కిన తొంభైలక్షలమంది ఎలాచస్తే మనకెందు కురా? మనవసరాలు మనవి. వాళ్లవసరాలు వాళ్లవి. నీశ్రేయస్సుకోసం నీవుపాటుపడాలి. ఇంకెవరైనా తవ్వి తల కెత్తుతారా? లోకమంతా ఎలా బ్రతుకుతుందో మనమూ అలాగే బ్రతకాలి. సంఘంమేలే మనమేలని దేవుళ్లాడే వెధవ లందరూ గంగలో కలసిపోతారు తెలుసా? అసలది ప్రకృతి న్యాయానికే విరుద్ధం. సంఘమంటే ఏమిటయ్యా?

వాసు : (చిఱునవ్వుతో) మనమందరం కలిస్తేనే సంఘం.

ప్రసాద్ : మనందరం ఎవరిసుఖం ఎవరిశ్రేయస్సు వాళ్లు చూసు కుంటేసంఘం బాగుపడినట్లు కాదురా? మోహన్! నీవింకా చిన్నవాడివి చెపుతున్నావిను, ప్రతివ్యక్తిముందు తనమేలు కోసం తాను కృషిచేస్తేనే బాగుపడతాడు, (వీధిగుమ్మంగంట మ్రోగుతుంది. వాసు అటుచూస్తాడు.) అంతేగాని, ప్రపంచ భారమంతా వాళ్ల భుజాలమీదే మోసుకెళ్లాలి, సంఘ శ్రేయస్సు, సంఘక్షేమమంటూ గంతులువేసే ఎంగ్రవెధవలంతా నా[illegible]పోతారు తెలుసా?

వాసు : ఎవరో వచ్చినట్టుంది?

ప్రసాద్ : సీతయ్య తలుపు తీస్తాడులే.





[ఒకక్షణం అంతా నిశ్శబ్దం-సీతయ్య ప్రవేశం]

సీతయ్య : ఎవరో ఇన్‌స్పెక్టరుగారు వచ్చారండి !
ప్రసాద్ : ఇన్‌స్పెక్టరు ! ఏ ఇన్‌స్పెక్టరు ?
సీతయ్య : ఏమోనండి.
ప్రసాద్ : నా కోసమేనా ?
సీతయ్య : అవునండి చాలముఖ్యమైన పనుందటండీ.
ప్రసాద్ : సరే ! లోపలికి పంపించు—ఇవితీసుకుపో ?

[సీతయ్య టేబిల్‌మీద సామానులు తీసుకుపోతాడు.]

ప్రసాద్ : మోహన్ ! చీకటిపడుతుంధి లైట్లువెయ్యి.

[మోహన్ లైట్లువేస్తాడు. తెల్లటివెలుతురు ఆవరించి అంతవరకు వ్యాపించివున్న సన్నగులాబీ రంగుకాంతిని మింగేస్తుంది.]

ప్రసాద్ : మొన్న ఇక్కడొక దొమ్మీకేసు జరిగిందిలే ! దానిగురిం చనుకుంటాను.
వాసు : ఎప్పుడు ?
ప్రసాద్ : ఊళ్ళో రెండుపార్టీలున్నాయి. కక్షలుపెరిగి నిన్నరాత్రి కొట్టుకున్నారుట. అందులో ఒకడు చనిపోయాడు. క్రూరవాడు పాపం ! యీ వూరు కూలీసంఘ శెక్రటరీఅట
వాసు : యీ పాటకప్రజాతికి జంతువులకు ఏమీ భేదం కనపడదు ఎప్పుడూ కొట్లాటలే—

[ఇన్స్పెక్టరు ప్రవేశం. ఒక క్షణం గుమ్మంవద్ద నిలబడి అంద రినీ తేరిపారచూస్తాడు. సుమారు ముప్పయి యేళ్ళు. గంభీరుడు. అతని తీక్ష్ణమయిన దృష్టిఎదుటివారిని కంగారుపరచి భయపెడుతుంది. అవసరాన్ని బట్టి జేబులోనుంచి ఒక చిన్న నోటుబుక్కు తీసి వ్రాసుకుంటాడు.]

ఇన్స్పెక్టరు : ఏమండి ? శివరామప్రసాద్‌గారు మీరేనా ?

ప్రసాద్ : అవును. కూర్చోండి.
ఇన్‌స్పెక్టర్ : థాంక్స్! [కూర్చోడు]
ప్రసాద్ : మోహన్, సీతాయిని పిలిచి కాఫీ తెప్పించు.
ఇన్‌స్పెక్టర్ : అనవసరంగా శ్రమపడకండి. నేను డ్యూటీమీద వచ్చాను.
ప్రసాద్ : [నవ్వుతూ] మీ రీప్రాంతానికి కొత్తగ వచ్చినట్టుంది ?
ఇన్‌స్పెక్టర్ : అవును.
ప్రసాద్ : మిమ్మల్ని చూడగానే అనుకున్నాను. ఇక్కడివారయితే నాకు తెలియకుండా ఎలా వుంటుంది ? అంటే, ఈ మధ్య మూడు సంవత్సరాలు డిస్ట్రిక్టుబోర్డు ప్రెసిడెంటుగా వున్నానులెండి.
ఇన్‌స్పెక్టర్: అయి వుండొచ్చు,
ప్రసాద్ : మీరిక్కడికి వచ్చినపని ? నిన్నటి దొమ్మీ కేసుగురించేనా?
ఇన్‌స్పెక్టర్ : కాదు, [అందరినీ తీవ్రంగా పరిశీలిస్తూ నిలబడతాడు,]

[ కొంత వ్యవధి ]

ప్రసాద్ : [విసుగ్గ] అయితే మరెందుకో చెప్పండి !
ఇన్‌స్పెక్టర్ : కొన్ని సంగతులు కనుక్కుందామనివచ్చాను...రెండు గంటల క్రితం ఏలూరు గవర్నమెంటుఆస్పత్రిలో ఒక స్త్రీ చనిపోయింది. పేగులు పూర్తిగ మాడిపోయాయి. యమ బాధపడి చనిపోయింది. డాక్టర్లెంత ఆందోళనపడినా లాభం లేకపోయింది.
మోహన్ : పాపం !
ఇన్‌స్పెక్టర్: ఏసిడ్ తాగేసింది. ఆత్మహత్య చేసుకుంది.
ప్రసాద్ : అయ్యో పాపం ! చాల అన్యాయం ! కాని ఆవిషయంలో మీరిక్కడికి రావలసిన పని ? నాకేమీ బోధపడడంలేదు.
ఇన్‌స్పెక్టరు: ఆమె వుంటున్న గదిలో ఒక వుత్తరం వ్రాసి వుంచింది. క్లుప్తంగా తన జీవితాన్నంతా వివరిస్తూ వ్రాసింది. చిన్నతనం

లోనే తలిదండ్రులు పోయారట. మేనమామ సహాయంతో ట్రైనింగు పాసుఅయింది. అంతలోనే ఆయనకూడపోయాడట. చివరికి "నా" అనే వాళ్ళెవరూ లేక అనాథ అయిపోయింది. రెండు మూడు వుద్యోగాలుచేసింది. పరిస్థితులు ఎంతవిషమంగా పరిణమించాయంటే, తను చేసిన ప్రతి వుద్యోగంలోను పేరు మార్చుకోవలసివచ్చింది. కాని ఆమె అసలుపేరు— సావిత్రి.

ప్రసాద్ : సావిత్రా ?

ఇన్స్పెక్టర్ : మీ కాపేరు బాగా పరిచయమేగా ?

ప్రసాద్ : నాకా ? నా కెలా పరిచయం ? యింతకీ యీ కేసులోకి నా పేరెందుకు లాక్కొస్తున్నారో అర్థంకావడంలేదు.

ఇన్స్పెక్టర్ : మీరు ప్రెసిడెంటుగావున్న రోజుల్లో ధర్మవరం బోర్డు గరల్సు స్కూలులో టీచరుగా వుండేది. గుర్తొచ్చిందా ?

ప్రసాద్ : అయి వుండొచ్చు ఎంతో మంది టీచర్లుంటారు. లెక్కా జమా ?

ఇన్స్పెక్టర్ : కాని యీమెమాత్రం సాధారణమయిన మనిషికాదు. మీకుబాగా జ్ఞాపకం వుండవలసిన మనిషి. ఆమె ఫోటో ఒక టుంది. బహుశ, చూస్తె పోల్చుకోగలరు !

[ఇన్స్పెక్టరు జేబులోనుంచి ఒక పోస్టుకార్డుసైజు ఫోటోతీసి శివరామప్రసాద్ దగ్గరకు వెళ్తాడు. వాసు, మోహన్ లేచి ఆఫోటో చూడ డానికిప్రయత్నిస్తారు, కాని ఇన్స్పెక్టరు వాళ్ళకుఅడ్డంతిరిగి చూడనీయడు వాళ్ళు వెనుక్కుంటారు. శివరామప్రసాద్ ఫోటోను పరీక్షగా చూస్తాడు చూడడంఅయినతరవాత యిన్స్పెక్టరు దానిని తనజేబులోపెట్టుకుంటాడు.

వాసు : ఇన్స్పెక్టరుగారూ ! ఆఫోటో మే మెందుకు చూడకూడదు

ఇన్స్పెక్టర్ : [సూటిగా చూస్తూ] కారణంవుంది.

మో : ఎందుకని ? నేను...

ఇన్స్పెక్టర్ : [గట్టిగ] చూడకూడదు.

వాసు : ఇదంతా నాకగమ్యగోచరంగా వుంది.

మోహన్ : ఆశ్చర్యంగా వుంది.
ప్రసాద్ : చెప్పవలసివస్తె, నాకుకూడ అలాగేవుంది. అసలు యీ విషయం ఏమిటో ?......

ఇన్స్పెక్టర్: ప్రస్తుతం యీ విచారణ నేను యిలాగే చేయదలచుకున్నాను. ఏవ్యక్తినైనా విచారణ చేస్తున్నప్పుడు యితరులెవరయినా అందులో కలుగజేసుకుంటే అంతా రసాభాస అవుతుందని నాసిద్ధాంతం. అందుచేత నేనెవరినయినవిచారణచేస్తూవుంటే యింకెవరూ అందులో కలుగజేసుకోవద్దని నామనవి.

ప్రసాద్ : మీ యిష్టం !
ఇన్స్పెక్టరు : ఇప్పటి కయినా మీకు సావిత్రి విషయం జ్ఞాపకమొచ్చిందా ?
ప్రసాద్ : సావిత్రా ? ఆఁ, అవును, ఆమె యీవూరు బోర్డుస్కూల్లో పనిచేస్తూ వుండేది. కొన్నాళ్ళకి వుద్యోగంలోనుంచి తీసి వేశారనుకుంటాను.
మోహన్ : [విషాదంగా] అందుకేకాబోలు ఆత్మహత్యచేసుకుంది.... పాపం !
ప్రసాద్ : మోహన్ ! నీవు అసందర్భంగా వుద్రేకపడకు ! అది ఏనాటి సంగతి.... రెండేళ్ళయింది – [ఇన్స్పెక్టరు వంకతిరిగి] వుండండి చెప్తాను, '46 వేసవిలో
ఇన్స్పెక్టరు : అవును '46 మార్చిలో
వాసు : [వెళ్ళిపోవాలని లేస్తూ] క్షమించండి ! యిదేదో అంతమయ్యే వరకూ నేను తోటలో వుంటాను.

ప్రసాద్ : ఏంపరవాలేదు వాసు, వుండు. యిక్కడేమీ రహస్యాలు లేవులే ! ఇంతకీ వీళ్ళని ముందు మీకు పరిచయం చేయడం మంచిది. మోహన్ – మాఅబ్బాయి. బి. ఏ. చదువుతుంటున్నాడు. ఈయన వాసుదేవరావుగారు – రావుబహద్దూరు వీరకవచం రామకోటేశ్వరరావుగారి కుమారుడు.

ఇన్స్పెక్టరు : [అతనిగురించి ఏమో తెలిసివున్నట్లు] వాసు దేవరావు గారు మీరేనా ?

వాసు : అవునండి !

ఇన్స్పెక్టరు : అలాగా........అయితే మీరిక్కడే వుండడం మంచిది.

వాసు : [భయంతో] ఆ ? సరే, అలాగే !

ప్రసాద్ : ఇన్స్పెక్టరుగారూ, యీ కేసువిషయంలో నాకు సంబంధించి నంతవరకూ యేమీ రహస్యంలేదు. అదికాక, యీసంగతి సుమారు రెండు సంవత్సరాలక్రితం జరిగిందికాబట్టి యిప్పు డావిడ ఆత్మహత్యతో ఏమి సంబంధం వుంటుంది చెప్పండి ?

ఇన్స్పెక్టరు : ఏం ? ఎందుకుండకూడదు ?

ప్రసాద్ : ఎలావుంటుంది చెప్పండి ?

ఇన్స్పెక్టరు : ఎలాగంటారా ? కొన్ని సంవత్సరాలక్రితం జరిగిన సంఘటనకు పర్యవసానంగా కొన్ని విషాదఫలితాలు కలిగి వుండవచ్చు. ఆబాధల మూలంగా, ఆమె ఆత్మహత్యచేసుకొని వుండవచ్చు. లోకంలో జరిగే సంఘటనలు ఒకదానికొకటి సంబంధం వుంటుంది.

ప్రసాద్ : కావచ్చులెండి ! ఐతే, ఆమెకు ఎప్పుడో ఏదో జరిగితే అందుకోసం యిప్పు డాత్మహత్య చేసుకుంటుందంటారా ఏం మనకు తెలిసిన ప్రతిమనిషి జీవితానికి మనదే బాధ్యత అంటే అపహాస్యంగా వుండదూ ? ఆవిధంగాచూస్తే ఆమెను నేనే హత్య చేశాననవచ్చు !

ఇన్స్పెక్టర్ : అవును. అది చూపడానికే నేనొచ్చాను.

[అందరూ నిశ్చేష్టులవుతారు. ఒక్కక్షణం నిశ్శబ్దం]

వాసు : అసలు అలాగేకాని జరిగితే మన జీవితాలు అసాధ్యాలు కావూ ?

ఇన్‌స్పెక్టరు : ఇప్పుడా మీమాంసఅనవసరం. ప్రస్తుత విషయానికిరండి
[ప్రసాద్‌నుద్దేశించి] సావిత్రిని గురించి మీకేమేమి తెలుసునో చెప్పండి.

ప్రసాద్ : ఆఁ, ఆమె చాల తెలివితేటలుగల అమ్మాయి. మంచి సాంప్రదాయాలుగలది. ఒక్క సంవత్సరమే ఆస్కూల్లో పని చేసింది. ఆమెఅంటే పిల్లలు ప్రాణం పెట్టేవారట. పై గ్రేడు లోకి ప్రమోటు చేయమని హెడ్మాస్టరు సిఫారసు చేశాడు కూడ. నేనూ ఆమె రికార్డంతా చూచి అలాగే చేద్దామను కున్నాను. కాని ఏంలాభం! తనకాఅదృష్టం వుంటేనా?

ఇన్‌స్పెక్టర్ : ఏం? ఏంజరిగింది.

ప్రసాద్ : ఆవిడ ఇంట్లో మీటింగులు. సమావేశాలు మొదలు పెట్టారు! కూలీ మూకంతా అక్కడికి చేరడం, కుట్రలు పన్నడం! ఆకూలీ వెధవలకి మే మనాదిగా యిస్తున్న కూలీ చాలలేదట, పావలా ఎక్కువకావాలిట! అంతేకాదు; యింకే వేవో గొంతెమ్మ కోరికల జాబితారాసి ఆసంఘపెద్దలు నాదగ్గరకొచ్చారు. వెధవలు, ఎప్పుడూలేనిది, బెదిరింపులు మొదలుపెట్టేరు. రోజుకి ఏవో కొన్ని గంటలు పనిచేసి రింగు రంగా అని యిళ్ళకి వెళ్ళిపోతారట! ఇంకా కూలీ ఎక్కించాలట! వెధవలు! యీఆటలు నాదగ్గర సాగేవికావు. వాళ్ళ డిగినవాటిలో దేనికీ నేనుఒప్పుకోనని ఖచ్చితంగా చెప్పేశాను.

ఇన్‌స్పెక్టర్ : ఏం? ఎందుకూ?

ప్రసాద్ : [ఆశ్చర్యంతో]. ఎందుకా?

ఇన్‌స్పెక్టర్ : అవును. మీ రెందుకొప్పుకోలేదు?

ప్రసాద్ : నేను నాకూలీలకు ఎంతిస్తానో, ఎంతసేపు పనిచేయించుకుంటానో అదంతా మీకెందుకండీ?

ఇన్‌స్పెక్టరు : ఏమోలెండి! అవసరముంటుందేమో!

ప్రసాద్ : [కోపంగా] మీ ధోరణి చాలా విపరీతంగావుంది.

ఇన్స్పెక్టరు : ఏం! విపరీతమేముంది? మీరు అడిగిన ప్రశ్నకి జవా బిచ్చాను, అంతే!

ప్రసాద్ : దానికి ముందు మీరే, ఒక అనవసరము, అసంబద్ధమైన ప్రశ్న వేశారు.

ఇన్స్పెక్టరు : విచారణలో ప్రశ్నలువేసి కావలసినదంతా తెలుసు కోవడం నా డ్యూటీ.

ప్రసాద్ : నాడ్యూటీ ఏమిటో తెలుసా? వ్యవసాయ ఖర్చులను సాధ్యమయినంతవరకు తగ్గించడం. వాళ్లడిగే వాటన్నిటికి నొప్పుకొనుంటే ఏమయేది? ఏటేటా అదనంగా ఎనిమిదివేల ఖర్చయేవి. ఆడబ్బు మీరిచ్చుకుంటారా? నేను సర్కారు పేష్కష్ కట్టుకోవద్దూ? అది తగ్గించేదాత ఏడీ? పనిచేయుట యిష్టంలేకపోతే యింకో వూరికిపోయి పనిచూచుకోమన్నాను

మోహన్ : ఉన్న వూరు విడచి ఇంకెక్కడికి పోగలరు నాన్నా పిల్లా, పాపా అంతా! పాపం!

ఇన్స్పెక్టరు : నిజం చెప్పారు.

ప్రసాద్ : [వారిద్దరినీ చురచురచూస్తూ] ఆఖరికి వాళ్లంతా సమ్మె చేశారు దౌర్భాగ్యులు! ఎన్నాళ్లో సాగలేదులెండి!

వాసు : పూటకూటికి గతిలేని వెధవలు అలిగి కూర్చుందామం ఎన్నాళ్లు సాగుతుంది మరి?

ఇన్స్పెక్టరు : సావిత్రి సంగతేమిటి?

ప్రసాద్ : యీసావిత్రికి ఆసమ్మెతో చాల సంబంధముండేదండి! ప్ర చిన్నదానికి సలహాలని ఈ వెధవలు ఆమెవద్దకు చేరేవా ఒంట్లో బాగులేదని వారంరోజులు సెలవుపెట్టి యీ తతం మంతా నడిపించింది. సుఖంగా జీవించే ప్రాప్తి వుంటేగనూ ఒకరోజుఆమెను పిలిచి ఇదంతా ఏమిటని అడిగితే వా కోరికల జాబితామీద ఒక పెద్ద వ్యాఖ్యానం చేసింది కూలీలమీద ఆమె కెంతో ప్రేమ ఉన్నట్లున్నూ, నా

లేనట్లున్నా ! అప్పుడే అనుకున్నాను. ఇదిచాలా ప్రమాదమైన ఆడదిరా అని.

ఇన్స్పెక్టరు : సమ్మె ఏమైంది ?

ప్రసాద్ ; ఏమవుతుంది? మంటగలసిపోయింది. వారంరోజుల్లో సమ్మె నాయకులంతా ఒక దొమ్మీ కేసులో జైళ్ళకెళ్ళారు. దానితో దారి, తెన్నూ తెలియక మిగిలిన వాళ్లు చచ్చినట్లు పనిలోకి వెళ్లారు. తరువాత ఎండాకాలము సెలవల వరకు చూచాను. సావిత్రిలో ఏమయినా మార్పొస్తుందేమోనని ! అంతే ! తరువాత డిస్మిస్ అయిపోయింది.

వాసు : మంచి పని చేశారు !

మోహన్ : అంతబాగా పనిచేసే ఆమెను డిస్మిస్ చేయడం చాలా అన్యాయం. పాపం ! యీ రోజులలో ఒకసారి ఉద్యోగం పోతే మళ్ళీదొరకడం ఎంతకష్టం !

ప్రసాద్ : చాల్లే ఊరుకో ! ఇటువంటివాళ్లందరికీ వెంటవెంటనే బుద్ధి చెప్పకపోతే ఏరాత్రో లేచి ప్రపంచమంతా మాదే అని ఎగబడరూ ?

వాసు : మొక్కలో తుంచకపోతే, మానై ఊరుకోదూ ? ఇక వాళ్లని పట్టపగ్గాలుంటాయా ?

ఇన్స్పెక్టర్ : కావచ్చు ! చేతిలోది బలవంతంగా లాక్కోవడంకంటె ముందు మర్యాదగా అడగడం మంచి పద్ధతిగాదూ ?

ప్రసాద్ : (లేనిచనువు తెచ్చుకొని) మీ పేరేమిటన్నారూ ?

ఇన్స్పెక్టర్ : రంగారావు.

ప్రసాద్ : సి. ఐ. డి. ఛీఫ్ కుటుంబరావుగా తిప్పుడెక్కడున్నారండీ !

ఇన్స్పెక్టర్ : ఈమధ్య కనపడటంలేదు.

ప్రసాద్ : (నవ్వుతూ) మీ కిప్పుడేచెప్పడం మంచిది ! కుటుంబరావు గారు నేనూ బాల్యస్నేహితులం. తరుచు ఇక్కడికొస్తుంటారుగూడా—అప్పుడప్పుడు టెన్నిస్ ఆడుకుంటూవుంటాం మా కోర్టులో.

ఇన్‌స్పెక్టర్ : (పొడిగా) నేను [illegible] !
ప్రసాద్ : (నవ్వునటిస్తూ) మీరాడతారని నేనెప్పుడూ అనుకోలేద
మోహన్ : (ఏదో ఆలోచిస్తూ హఠాత్తుగా) ఇది చాలా అన్యాయం
ఇన్‌స్పెక్టర్ : నేను టెన్నిస్ ఆడక పోవడమా ?
మోహన్ : ఆ టీచరు, కూలీలను గురించి ! ఇంతకీ ఆమెను డిస్మి
చెయ్యడమెందుకునాన్నా ! స్కూలు శ్రేయస్సు కోరితే
ఆమె నక్కడే ఉంచవలసింది.
ప్రసాద్ : (కోపంతో మండిపడుతూ) ఈ వెర్రివేదాంతం విడిచిపె
మనినీకెన్నోసార్లుచెప్పాను...నీచదువేమిటో, నీబాధ్యతేమిటో
గమనించుకోరాదూ ! ఈదేశంలోచదువులు బాధ్యతఅనే
నేర్పవు. షికార్లుకొట్టడం సినిమాలకెళ్ళడం......
మోహన్ : (చిరచిరలాడుతూ) యీ గ్రంథం అంతా ఇప్పుడే వల్లి
చాలికదూ !
ప్రసాద్ : (ఇన్స్పెక్టర్‌తో, ముగింపుగా) అంతకంటె మీకుచెప్ప
వలసిన దేమిలేదు. ఆమెకు డిస్మిస్ ఆర్డరువచ్చింది. వెళ్ళి
పోయింది అంతే...ఆతరువాత ఏమిజరిగిందో మీకే తె
యాలి ? ఏగొడవల్లో నయినాచిక్కుకుని వీధులపాలయి
దేమో !
ఇన్స్పెక్టర్ : వెంటనేవెళ్ళి వీధుల్లో పడలేదులెండి !

[సుశీల ప్రవేశం [illegible]]

సుశీల : వీధుల్లో పడడమేమిటి ఎలాగా ? (ఇన్స్పెక్టర్‌ను చూచి) ఓ
క్షమించండి (తండ్రితో) [illegible] లేదేమ
అమ్మ చూసింయుంది.
ప్రసాద్ : ఒక్క నిముషం ఆగు, వస్తున్నాను !
ఇన్స్పెక్టర్ : ఇదిఒక్క నిముషంలో అయ్యేదికాదు.
ప్రసాద్ : (కోపంగా) యింత [illegible] లేదు. మీ కిదివర
చెప్పాను.

సుశీల : ఏమిటీగొడవంతా ?
ప్రసాద్ : ఏమీ లేదమ్మాయ్, నీవు లోపలికి వెళ్ళు, ఇప్పుడేవస్తాను!
ఇన్ స్పెక్టర్ : (సుశీలతో) వద్దు. ఒక్క క్షణం ఉండండి.
ప్రసాద్ : (మండిపడుతూ) ఏమిటీఅధిక ప్రసంగం? మీసంగతి వెంటనే కుటుంబరావుగారికి రిపోర్టు చేస్తాను చూడండి! ఈకేసు విచారణలో మా అమ్మాయెందుకు ?
సుశీల : ఏం కేసు ? ఏమిటి ? అసలిక్కడ ఏం జరుగుతోందో నా కేమీ బోధపడ్డడం లేదు.
ఇన్ స్పెక్టర్ : (ముందుకువచ్చి గంభీరంగా) నేను పోలీసుఇన్ స్పెక్టరు నండీ, నాపేరు రంగారావు. యీవేళ మధ్యాహ్నం ఏలూరు ఆస్పత్రిలో ఒక స్త్రీ చనిపోయింది. ఏసిడ్ తాగేసింది. దుస్సహమైన బాధపడి చనిపోయింది.
సుశీల : (బాధగా) ఓ ! ఎంతఘోరం, పొరపాటున జరిగిందా ?
ఇన్ స్పెక్టర్ : కాదు. కావాలనే త్రాగింది. అంతకంతకు దుర్భరమౌతున్న జీవితాన్ని, ఒక్కసారిగా అంతంచేసేసుకుంది !
ప్రసాద్ : ఎప్పుడో రెండు సంవత్సరాల క్రితం నేను ప్రెసిడెంటుగా వుండగా తీసేశాను. యిప్పుడామె చనిపోడానికి కారణం అదే అంటాడీయన ! చూడు. ఎంతబాగుందో ?
మోహన్: దానితోనే ఆవిడకష్టాలు ఆరంభమయ్యాయంటున్నారు!
సుశీల : మీరామెను తొలగించారా ?
ప్రసాద్ : అవును ! ఊళ్ళో కూలీలచేత సమ్మెలు చేయిస్తూవుంటే చూస్తూ ఊరుకుంటావా ఏం ?
వాసు : ఊరుకుంటే మనల్ని బ్రతకనిస్తారూ వీళ్ళు. నెత్తిమీదికెక్కిపోరూ ? (సుశీలను చూచి) ఏం అలా వున్నావ్ ?
సుశీల : (విచారంగా) ఏమీలేదు. నామనస్సదోలమాదిరిగాఉంది... ఎంత ఘోరంగ ప్రాణాలు తీసుకుంది. ఇంతవరకు సంతోషంగా గడిపాం. మీరీవిషయం చెప్పకపోతే నేబాగుండేది... ఎంత వయస్సుంటుందామెకు ?

ఇన్ స్పెక్టర్ : పాతికేళ్ళుండొచ్చు.
సుశీల : అందంగ వుండేదేమో ?

ఇన్ స్పెక్టర్ : ఆసుపత్రి పాలగచ్చుమీద శవాన్నిచూస్తే నా కేమీ అందం కనిపించలేదు. కనుగుడ్లు పైకొచ్చాయి. మొహం వికృతంగ తిరిగివుంది...కాని జాగ్రత్తగాచూస్తే ఒకప్పుడు చాల అందకత్తే అయివుండాలి.
ప్రసాద్ : (విసుగ్గా) ఇంతటితో చాలించండి.

వాసు : ఆవిడెందుకు చచ్చిపోయిందో మీరు నిజంగా తెలుసుకోవాలంటే ధర్మవరం స్కూలునుంచి వెళ్ళిపోయింతర్వాత ఏం జరిగిందో తెలుసుకోవడం అవసరం. అంతేకాని...
ప్రసాద్ : నేనూ అదే అంటున్నాను.

వాసు : ఆవిషయంలో మీ కేవిధంగానూ మేము సహాయం చెయ్యలేముగదా ! ఆగొడవలన్నీ మాకెలా తెలుస్తాయి. అయినా...
ఇన్ స్పెక్టర్ : మీకెవరికీ తెలియదని ఖచ్చితంగా చెప్పగలరా ?

[ఇన్ స్పెక్టరు వాసు, మోహన్, సుశీలవంక ఒకరితర్వాత ఒకరిని పరీక్షించి చూస్తాడు.]

ప్రసాద్ : వీళ్ళలో ఒకరికి తెలును నంటారా, అయితే ?
ఇన్ స్పెక్టర్ : అవును.
ప్రసాద్ : (భయంతో ఏదోవిధంగా తప్పించాలని) పోనిద్దురూ ? ఇప్పుడింత శ్రమపడి అంతాతవ్వి తీసి ఏంలాభం ?
ఇన్ స్పెక్టర్ : (దబాయిస్తూ) చచ్చిందెల్లాగ చచ్చిందికదా అని కామాప్ చేసేయమనా మీ ఉద్దేశ్యం ?
సుశీల : (కోపంగా) అయితే మీరనేదేమిటి ? ఆవిడ చచ్చిపోవడానికి కారణం మేమే నంటారా ?
ప్రసాద్ : నీవలా ఉండుమనీ ! రంగారావుగారూ ! బహుశామనిద్దరం కూచుని యీ కేసునుగురించి సావధానంగా ఆలోచిస్తేమంచిది!

సుశీల : (వేళాకోళంగా) మీ౦ాపని అయిపోయిందట ఇకమాల్లో ఒకరిని విచారిస్తారేమో !

ప్రసాద్ : అవున్లే అందుకే మనందరి తరఫునా ఇదిసాక్షిగ పరిష్కరించేస్తే మంచిది.

వాసు : నాతరఫున మాత్రంఎవరూ ప్రశ్నమా తీసుకోనక్కరలేదు. నా కావిడెవరో తెలియదు.

మోహన్ : నా కంతకంటే తెలియదు.

సుశీల : (ఏదో ఆలోచిస్తూ) ఆవిడ పేరేమిటన్నారూ ?

ఇన్స్పెక్టరు : సావిత్రి.

సుశీల : సావిత్రా ! ఏమో ! ఎవరో ! నాకు తెలియదు ?

వాసు : చూచారా ఇన్స్పెక్టరుగారూ, ఎమంటారు ?

ఇన్స్పెక్టర్ : ఇంతకుముందన్నదే. ఆవిడ స్కూలుఫైనలు పాసయిన తరవాత రెండు మూడుద్యోగాలు చేసింది. వాటిలో వేర్వేరు పేర్లతో తిరిగేది. సమ్మెలో సహాయపడిందని స్కూలునించి డిస్మిస్ అయేవరకూ ఆవిడ సావిత్రి, తరవాత ఆపేరు విడిచింది. అచ్చిరాలేదుకాబోలు !

మోహన్ : పాపం !

సుశీల ; చాల అన్యాయం నాన్నగరూ ! బహుశా అప్పటి నుంచి ఆవిడ దుర్గతిపాలై ఉంటుంది !

ప్రసాద్ : నాకన్నన్ను !

ఇన్స్పెక్టర్ : ఆతరవాత, యీచిన్ని పట్టణములో ఉద్యోగం దొరకడం కష్టమని మద్రాసు చేరుకుంది. మానవమర్యాదకి భంగం కలగకుండా ఏదయినా ఉద్యోగంసంపాదించాలని, కాళ్ళు మాడిపోతూగూడ తిరిగింది. ఆఖరికి పనిమనిషిగా దొరకక చేసుకుంది !

సుశీల : పాపం ఎంతకష్టం ! పాడు ప్రపంచం

ఇన్‌స్పెక్టర్ : అటువంటివాళ్ళు మన దేశంలో చాలమంది ఉన్నారు సుశీలగారూ! లేకపోతే మసీళ్ళల్లోకి, ఫ్యాక్టరీల్లోకి చౌకగా పనివాళ్లెలా దొరుకుతారు?

సుశీల : చౌకగ కూలీలు దొరుకుతారని వాళ్ళనలాచూస్తూ ఫ్రా కోవడం అన్యాయం కాదూ?

ఇన్‌స్పెక్టర్ : ఈవిధంగా మలమలమాడేవాళ్ళ బ్రతుకు తెల వుంటాయో, ఊహించుకోలేరు మీరు.

సుశీల : అవును, పాపం! ఆ తరువాత ఎలా బ్రతికిందండీ?

ఇన్‌స్పెక్టర్ : ఆఖరికి అదృష్టం ఫలించింది. ఒకరోజు "హిందూ పత్రికలో ఇద్దరు పెద్దయింటి పిల్లలకు చదువు చెప్పడానికి ఒ టీచరు కావాలని ప్రకటన చూచి దరఖాస్తు పెట్టుకుంటే ఆప కుదిరింది. కొంగల్లు జమీందారు గారి ప్రకాశరావుగారింట్లో (ప్రశ్నార్థకంగా సుశీలనంక చూస్తాడు)

సుశీల : (సందిగ్ధంగా) గారి ప్రకాశరావుగారా? మా శకుంతల ఇంట్లో అన్నమాట. అక్కడ పని దొరకడం అదృష్టమే. ఆయ చాల మంచివారు. (ఈ మాటలన్న తరువాత, ఏదో మ స్సుకు స్ఫురిస్తుంది. ఏదో పరధ్యానంగా ఆలోచిస్తూవుంటుంది

ఇన్‌స్పెక్టర్ : ఆమెకూడ మొదట అలాగే అనుకుంది. మనస్సుక నచ్చినపని, ఇంట్లోనే తిండి, బట్ట దొరుకుతుంది. పిల్లల ఆ పాటలు చూస్తూవుంటే, తన పిల్లలే అన్నట్లు ఆనందంగా వుండేది. శ్రద్ధగా చదువుకునేవారట. ఇంటివారుగూడా గా వాదరాలతో చూస్తూవుండేవారట.

వాసు : ఐతే అక్కడే వుండిపోవలసింది.

ప్రసాద్ : అక్కడేం అఘాయిత్యం చేసిందో!

ఇన్‌స్పెక్టర్ : ఎలాగో రెండు నెలలు గడిచాయి ఒ గా తనజీవిత స్థిరపడుతుందని సంతోషపడింది. అకస్మాత్తుగా ఒకనాడు గా ప్రకాశరావుగారు పిలిచి జీతంఇచ్చేసి, నీవిక్కడ పనిచేయ నక్కరలేదు, తక్షణం వెళ్ళిపో, అన్నారుట.

ప్రసాద్ : పిల్లల్ని సరిగాచూడాము కోపమా లేముగాబోలు !

ఇన్ స్పెక్టర్ : పనిలో ఏమాత్రం లోపంలేదు...

మోహన్ : మరి ?

ఇన్ స్పెక్టర్ : ఆమె గ్రహించినంత మట్టుకు ఆమెపై ఎవరో దొంగ నేరాలు మోపి వెళ్ళగొట్టారట.

సుశీల : ఆవిడెలా ఉంటుందండి ?

ఇన్ స్పెక్టర్ : ఇదిగోయీ ఫోటో చూడండి ! (లైటుదగ్గరకు నడుస్తాడు సుశీల ఆతృతగా దగ్గరకు వెళ్తుంది. ఫోటోను సూక్ష్మంగ చూస్తుంది, పోలికపడుతుంది. గద్గదకంఠంతో "ఆవిడే" అన్న మాటవిన బడుతుంది. విజృంభిస్తున్న దుఃఖంతో వెక్కి వెక్కి ఏడుస్తూ లోపలికి పారిపోతుంది.)

ప్రసాద్ : ఏం జరిగింది ?

మోహన్ : ఆఫోటో పోలిక పట్టిందికదూ ?

ఇన్ స్పెక్టర్ : అయిఉంటుంది.

ప్రసాద్ : (కోపంతో ఉక్కిరిబిక్కిరవుతూ) చూడండేంచేశారో మీరు – బుద్ధిలేకుండ ?

ఇన్ స్పెక్టర్ : (నిర్లక్ష్యంగా నవ్వుతూ) నేనేం చెయ్యలేదే ?...... ఉన్నవిషయం చెప్పాను. ఉన్న ఫోటో చూపించాను.

ప్రసాద్ : మరెందుకలా ఏడుస్తుంది !

ఇన్ స్పెక్టర్ : నాకేం తెలీదు. ఇప్పుడామె కనుక్కోవాలి.

ప్రసాద్ : (చిరచిరలాడుతూ) నేను వెళ్ళి కనుక్కొస్తాను. మీరుండండి.

వాసు : నన్ను రమ్మంటారా ?

ప్రసాద్ : వద్దు నేనే వెళ్తాను. (గుమ్మందాకా గబగబా నడిచివెళ్ళి వెనక్కి తిరిగి తీక్షణంగా చూస్తూ) ఇంతవరకు, సంతోషంగా పార్టీ చేసుకుంటూంటే మధ్య మీరు దాపురించి ఏం చేశారో చూడండి. ధ్వంసంచేశారు.

ఇన్‌స్పెక్టర్ : (ధృఢంగా) మధ్యాహ్నం సావిత్రి మృత కళేబర చూస్తూంటే నాకూ అలాగే అనిపించింది. ఆశాపూరితమై ఆయువతి నిండు జీవితాన్ని ఇలా ఎవరో ఛిన్నాభిన్నం చే ధ్వంసం చేశారే. ఊం.

[ప్రసాద్ ప్రత్యుత్తరంగా ఎదో ఘాటయిన జవాబు చెప్పాలనుకున్న కనబడతాడు. కాని ఎందుచేతనో తగ్గిపోయి తటాలున లోపలి పోతాడు చిరచిరలాడుతూ. వాసు, మోహన్ దిగులుగా ఒక నొకరు చూచుకుంటారు.]

వాసు : ఒకసారి ఆ ఫోటో చూడనిస్తారా రంగారావుగారూ ?
ఇన్‌స్పెక్టరు : సమయం వచ్చినపుడు చూడగలరు,
వాసు : ఇప్పుడు చూడకూడదూ ?
ఇన్‌స్పెక్టర్ : మీ కిదివరకొకసారి చెప్పాను. త్వరలోనే మీ కొ అవకాశం యిస్తాను.
వాసు : (ఉపేక్షగా) అక్కర్లేదు లెండి.
మోహన్ : (విసుగ్గా) అంతకంతకీ శృతిమించి రాగానపడుతోందే
ఇన్‌స్పెక్టర్ : నేనూ అదే అనుకుంటున్నాను.
మోహన్ : (కలవరంగా) క్షమించండి. తల నొప్పిగా వుంది. అనః రంగా మీకడ్డంవుండడం ఎందుకూ ? లోపలికి పోతాను.
ఇన్‌స్పెక్టర్ : (అధికారపూర్వకంగా) మీ రిక్కడే వుండడం మంచి
మోహన్ : నేనెందుకు ?
ఇన్‌స్పెక్టర్ : శ్రమ తగ్గించుకున్న వారవుతారు. ఇప్పుడు బయట పోయినా మళ్లీ కొంతసేపట్లో తిరిగి, రావలసివుంటుంది.
వాసు : (కోపంపట్టలేక) మీరు చాల అసందర్భంగా మాట్లా తున్నారు.
ఇన్‌స్పెక్టర్ : మీకలాగే అనిపిస్తుంది !
వాసు : రంగారావుగారూ ! మేము మర్యాదగా బ్రతికే పెద్దమనుషుల కాని, దగుల్బాజీలు, ఖూనీకోరులం కామే !

ఇన్‌స్పెక్టర్ : ఈ రెండు తరహాల మధ్య మీరనుకున్నంత స్పష్టమైన విభాగం కనపడదు. ఆ భేదమేమిటో నన్ను నిర్ణయించమంటే ఆరెంటిమధ్య సరిహద్దు గీత ఎక్కడ గీయాలో తెలియక తికమక పడతాను!

మోహన్ : అదృష్టవశాత్తు ఆపని మీమీద వేయలేదు బ్రతికాం!

ఇన్‌స్పెక్టర్ : అదికాకపోయినా మరికొన్ని విషయాలు నామీద వదిలిపెట్టారు.

[సుశీల ప్రవేశం అంతవరకు ఏడుస్తున్న ముఖవైఖరి]

సుశీల : (కర్చీనానుకుని) మీకంతా తెలిసికూడా ఊ ంచారు కదూ?

ఇన్‌స్పెక్టర్ : ఆవిడ డైరీ చదివిన తర్వాత ఏదో చూచాయగ తెలిసింది అంతే!

సుశీల : వెంటనే ఆసంగతి నాన్నగారితో చెప్పాను. ఆయనేమీ అనలేదు. నిదానంగాఆలోచిస్తే నేనుచేసినది అన్యాయమే అనిపించింది చాలాబాధ పడ్డాను ఇప్పుడు మీరుగతాన్ని పైకిలాగి నన్ను మరింత కృంగదీస్తున్నారు...తరవాత ఆవిడ చాల యాతన పడిందేమో, పాపం!

ఇన్‌స్పెక్టర్ : అప్రను తనజీవింలో శాస్త్రస్థిరత్వం, సుఖం దొరికిన ఆఖరి ఉద్యోగం అదే, నిష్కారణంగ తనతప్పేమి లేకుండ ఆపని పోవడంతోనే మనసులో నిరాశ, సంఘంమీద రోత పుట్టింది. ఇకఅప్పటినుంచి స్థిరత్వం, మానమర్యాదలూ అనే భావాలకి స్వస్తిచెప్పి. జీవనోపాధి కోసంపూర్తిగా ఒకకొత్త దారి పట్టవలసి వచ్చింది.

సుశీల : (దుఃఖపూరితమయిన కంఠంతో) దీనంతకీ నేనే కారణం కదూ?

ఇన్‌స్పెక్టర్ : మీరొక్కరేకాదు ఇంకా ఉన్నారు. ఆతరవాత తన జీవితంలో ఎన్నో విపరీతాలు జరిగాయి.

వాసు : ఆ సావిత్రికి యీామె ఏం అపకారం చేసిందండి ?
ఇన్ స్పెక్టర్ : ఆకథచెప్పడం మీావంతు......
సుశీల : నేనా ? నామనస్సదోలా ఉంది.... నేను చెప్పలేను !
ఇన్ స్పెక్టర్ : చెప్పితీరాలి... ఊ... కానివ్వండి !

సుశీల : ఆరోజుల్లో ఒకసారి శకుంతల ఇంటికి మద్రాసు వెళ్లా అక్కడ సావిత్రి కనిపించింది. చక్కని మనిషి. ఆ ఇద్ద పిల్లలూ ఆమెను ఒక్కక్షణం విడిచి ఉండేవారు కారు. కా ఆ ఇంటివాతావరణం మాత్రం పూర్తిగా మారిపోయినట్ల పించింది. ఇంకా ఉపేక్షిస్తే పరిస్థితులు విషమిస్తాయేమో పించింది.

ఇన్ స్పెక్టర్ : ఏం ? ఎందుకని ? కారణం ?
సుశీల : కొన్ని విషయాలు చూచానక్కడ.
ఇన్ స్పెక్టరు : ఏవి ? విపులంగా చెప్పండి !
సుశీల : మాశకుంతల కొత్తకాపరం రోజులవి. ఒకనాడు శకుం భర్త రమేష్ ఆఫీసునుంచి వచ్చి ఇంట్లోకి వెళ్ళకుండా తోటలో పిల్లలతో ఆడుకుంటున్న సావిత్రితో మాట్లాడుత ఉండిపోయాడు. ఆయన మాటలు వింటూ వుంటే కొ అనుమానం కలిగింది నాకు....
ఇన్ స్పెక్టర్ : అది ఆమెతప్పా ?
సుశీల : (వ్యథతో) కాదు ! అదే నేను మొదట గ్రహించి వుం ఇంత ప్రమాదం జరిగేది కాదు. (వాసు తన వంక చూస్త వుండడం చూచి) చాల్లే వాసు, ఏమిటలా నిర్ఘూరం చూస్తావు, నేనేదో అఘాయిత్యం చేసినట్టు...

వాసు : (తుళ్ళిపడి) నేనలా, నన్నా ? నీవేదో చెప్తూతూం వింటున్నాను. అంతే !
ఇన్ స్పెక్టర్ : అవన్నీ మీారిమాటతరువాత సర్దుకోవచ్చులెండి !. తరువాత ఏం జరిగింది ?

సుశీల : రమేష్ ఆవిడతో ఎప్పుడూ మాట్లాడుతూ వుండడం, ఏదో ఆప్యాయతగా చూస్తూవుండడం నేనుకనిపెడుతూనేవున్నాను. నేనెప్పుడు మద్రాసువెళ్ళినా ఆయన నన్నెంతో అభిమానంతో చూచేవాడు. ఒక్క ఘడియ వూరికే వుండనిచ్చేవాడుకాదు. కులాసాగా కబుర్లు, కథలూ చెపుతూవుండేవాడు ఎంతో సరదాగా వుండేది.

వాసు : రమేష్ ఎప్పుడుకనపడినా నీకబుర్లే చెవుతూవుంటాడు, సుశీ.

సుశీల : అటువంటి ఆయన ఒక్కసారిగ మారిపోయాడు. నేను వచ్చానని ఉత్సాహం, సరదా ఏమాత్రం కనపడలేదు... ఆరోజు వాళ్లు తోటలోవుండి మాట్లాడుతూంటే నేను మేడ కిటికీలోంచి అంతా చూచాను. ఆయనెంతో వినయంగా నున్నితంగా మాట్లాడుతున్నాడు. ఆవిడెప్పుడూ కళ్ళల్లోకి చూస్తూ మాట్లాడేది. తనవంటిదానికుండవలసిన నమ్రత, బిడియం, ఎక్కడా ఏమీలేదు! అంతతో ఆగక తోటంతా ఘల్లుమంటూ ఇద్దరూ ఒకటేనవ్వు...నాకే సిగ్గేసింది. పనిమనిషితో అంత చనువుగా ఉండటం సిగ్గు చేటు కదూ? ఆవిడాయింట్లోవుంటే మాకకుంతల కొత్తకాపురం మంటగలసి పోతుందనిపించింది. వెంటనేవెళ్ళి వాళ్ళనాన్న గారికిదంతా చెప్పేను ఆ వుద్వేగంలో పాపంయేమన్నానో గాని, ఆమర్నాడే ఆవిడ వెళ్ళి పోయింది. (దుఃఖంతో కుము లుతూ ఉంటుంది)

ఇన్స్పెక్టర్ : అనాగరికులకు రావలసిన అలాంటి అనుమానం, అసూయమీకెలా కలిగాయండి! పట్టరాని మీ ఈర్ష్యఅలా చేసింది!

సుశీల : (మెల్లగా. స్థిమితపడుతూ) అవును.

ఇన్స్పెక్టర్ : మీశక్తిని, హోదాను వినియోగించి ఒకనిర్దోషిని అన్యాయంగా శిక్షించారు,

సుశీల : తరువాత చెప్పాడు రమేష్ ఆవిడ చాలయోగ్యురాలని బా
చదువుకున్నది, సంస్కారం కలదని (ఇంకాదుఃఖపడు
ఉంటుంది.)
మోహన్ : ఎందుకీ విచారంయిప్పుడు అంతాఅయిపోయినతర్వా
సుశీల : [illegible]యదు మోహన్, నేననుభవించేబాధ. ఇకనాజన్మ
.. గా అలాతొందరపడను. నేనంటేఎంతో అభిమా
గౌరవంవున్న రమేష్ యిప్పుడునాతో సరిగామాట్లాడనయి
మాట్లాడడు. యిప్పుడు శకుంతల ఇంటికివెళ్తే అంతా వెల
పోతూవుంటుంది వాళ్ళకి నేనేం కీడుచేశానుచెప్పు. నన
దోషిగాకట్టారు ! అన్యాయంకదూ ?
ఇన్స్పెక్టర్ : సావిత్రి కళేబరం వంక చూస్తుంటే నాకూ అల
అనిపించింది. ఆమె కెందు కంత అన్యాయం జరగాలి ? అ
యవ్వనంలో ఉన్నదాన్ని, అంత చదువు, సంస్కారం
దాన్ని లోకం ఎందుకు మృత్యు ముఖంలోకి తోసేసిం
దీని కంతకీ కారణం ఏమిటో తెలుసుకోవా లనే ఇక్క
కొచ్చాను.... మీ నాన్నగారు టీచరు పనిలోంచి తీసేశా
మీరు మీఅనుమానాలు, ఈర్ష్యలవల్ల ఇంకోవుద్యోగంలో
బైటికి గెంటించారు. ఏ దెలాగున్నా బ్రతుకు తెరువు చూ
కోవాలిగదా ! ఈసారి తన పేరు ప్రేమలత అని మార్చుకుని
వాసు : (త్రుళ్ళిపడి) ఏ మన్నారూ ?
ఇన్స్పెక్టర్ : ప్రేమలత......

[వాసు తన కలవరంలోంచి బయట పడడానికి ప్రయత్నిస్తూ లేచి షె
దగ్గరకు వెళ్ళి, ఒక పుస్తకం తీసి, చదవాలని కాగితాలు తిర
మళ్ళీ పెట్టేస్తాడు. ఇన్స్పెక్టరు, సుశీల ఇది గమనిస్తారు.]

ఇన్స్పెక్టర్ : (సుశీలతో) మీ నాన్నగా రేరీ ?
సుశీల : లోపలే వుంటారు.
ఇన్స్పెక్టర్ : బయటికి వస్తారా ? నేనే లోపలికి వెళ్ళనా ?

వాసు : ఇప్పుడే వస్తారు. వుండండి !

ఇన్‌స్పెక్టర్ : అక్కరలేదు... నేనే లోపలికి వెళ్తాను. (సుశీలతో) ఏమండీ !

సుశీల : (తడబడుతూ) మోహన్ !

[మోహన్ లేచి వెళ్తాడు. ఇన్‌స్పెక్టరు సుశీ వంక, తరువాత వాసువంక వింతగా చూచి, మోహన్‌ని అనుసరిస్తాడు]

సుశీల : ఏం వాసూ !

వాసు : (ఆప్యాయంగా దగ్గరకువస్తూ) ఏం ?

సుశీల : నీకెలా తెలుసు సావిత్రి ?

వాసు : నాకు తెలియదే !

సుశీల : సావిత్రిగాకపోతే ప్రేమలత? ఇద్దరూ ఒకరేగా ?

వాసు : ఎవరయినా నాకెందుకు తెలియాలి. ఏమో ! ఆమె ఎవరో !

సుశీల : నా దగ్గరకూడా నటించకు ! ఎందుకుదాస్తావు, చెప్పేయి ! ఆపేరు వినగానే వుచ్చుకాయలదొంగలా బయటపడిపోయావు.

వాసు : సరే ! తెలుసు నేఅనుకో, ఇప్పుడేం ?

సుశీల : అలా అంటే తీరిపోతుందనుకున్నావా ?

వాసు : (ఎలాగయినా మరిపించాలని దగ్గరకొచ్చి ప్రియంగా) అది కాదు, సుశీ !...

సుశీల : (విదిలించుకొని) అదంతా అనవసరం. నీకామె తెలియడమే గాక, చాలా పరిచయంకూడావుంది. లేకపోతే అలా అపరాధి లాగ ప్రవర్తించవు ! ఇప్పుడయినా చెప్పు. ఆమెకు నీకు సంబంధమేమిటి ? (వాసు జవాబు చెప్పడు) శకుంతల ఇంట్లో నుంచివెళ్ళిపోయి, తనకొత్తజీవితం మొదలుపెట్టినతర్వాతేనా? గత వేసవిలో నీ కేరానకార్యాలుండి నన్ను తప్పించుకు తిరిగావో నాకు తెలుసు (వాసు జవాబుచెప్పడు) అవును నేనామాత్రం గ్రహించలేనంటావా ?

వాసు : క్షమించు సుశీ ! జరిగిందేదో జరిగిపోయింది ఇక అదిమరిచి
ఆతరవాత నేనా మెను చూడనేలేదు...ఏమయినాసరే, య
కేసుతో నాకేమీ సంబంధంలేదు !

సుశీల : నేనూ మొదటఅలాగే అనుకున్నాను.

వాసు : అవును. నీకుకూడా సంబంధంలేదు (భయంతో) అయిన
ఇదిమాత్రం ఇన్స్పెక్టరుతో చెప్పకేం ?

సుశీల : (కోపంతో) ఏది ! మీయిద్దరి సంబంధాన్ని గురించేనా ?

వాసు : అవును ఆయనకు తెలియకూడదు. చాలాప్రమాదం !

సుశీల : (గట్టిగా వికృతంగానవ్వుతూ) ఆయనకప్పుడే ఇదంతా తెలు
మనం ఆయనకేమీ చెప్పనక్కరలేదు. మనందరిపాపా
కడిగి పెట్టడానికే వచ్చాడు !

[తలుపుమెల్లగా తెరుచుకుంటుంది. నిశ్శబ్దం.. ఇన్స్పెక్టర్ ప్రవేశిం
గుమ్మంవద్దనిలబడుతాడు నిదానంగా వాళ్ళనుపరీక్షిస్తూ, వాళ్ళగుండెల్లోదే
కొరకో గాలించి వెతుకుతున్నట్టు చూస్తాడు]

ఇన్స్పెక్టర్ : (ముందుకు నడిచివస్తూ అధికారపూర్వకంగా)
ఏమంటారు......నిజంబయట పెట్టండి !

[తెర]



## రెండోదృశ్యం

[అంతా ఒకటోదృశ్యంలోలాగే ఉంటుంది. ఇన్స్పెక్టర్ గుమ్మంవద్ద కొంచెంసేపు నిలబడి తరువాత ముందుకు నడిచి వస్తాడు]

ఇన్స్పెక్టరు : ఏం తేల్చుకున్నారు ఆఖరికి?

సుశీల : (దిగులుగా, వాసుతో) చూచావా? నేనుచెప్ప లేదూ?

ఇన్స్పెక్టర్ : చెప్పేదేమిటి! ఏమిటి చెప్పడం?

వాసు : (చెప్పిన అందుకొని) ఇన్స్పెక్టరుగారూ! దయచేసి యీమెనిక ప్రయాస పెట్టకండి చాలబడలికగ ఉన్నట్టుంది.

ఇన్స్పెక్టర్ : నిజంగా బడలికవుంటే మీరిక్కడ వుండనవుసరంలేదు మీవద్ద తెలుసుకో వలసిన విషయాలుగూడ ఇంకేమీ లేవు.

సుశీల : కాని మీవిచారణ ఇంతటితో అయిపోలేదు కదూ?

ఇన్స్పెక్టర్ : లేదు.

సుశీల : (వాసుతో) చూచావా! (ఇన్స్పెక్టర్తో) అయితే నేనిక్కడే వుంటాను.

వాసు : (ఆదుర్దాతో) నువ్విక్కడెందుకు సుసీ! ఉన్నకొద్దీ మనో వ్యధమరీ ఎక్కువవడంతప్ప! మగవాళ్ళం మేసేదోలాగ పడతాంలే యీపాట్లు. నా మాటవిని నువ్వులోపలకు వెళ్ళు!

ఇన్స్పెక్టర్ : అంటే స్త్రీలనుమాత్రం ఇలాంటి చికాకులనుంచి కాపాడాలంటారు! అంతేనా?

వాసు : సాధ్యమయినంత వరకు—స్త్రీని అబల అని ఊరికేఅన్నారా పెద్దలు. సున్నితమయిన మనస్సులు చూడండి!

ఇన్స్పెక్టర్ : అంత సున్నితమయిన మనస్సుల్ని కష్టాలనుంచి కాపాడే దాతలు లేక, ఎందరు స్త్రీలు సంఘానికి బలిఅయిపోతున్నారో తెలుసా మీకు?

వాసు : (చికాకుగా) మళ్ళీ మీకథ మొదలెట్టారూ?

సుశీల : ఇలాంటప్పుడు శ్రీరంగనీతులు చెపితే ఏమవుతుంది!

వాసు : అదికాదు సుశీ! నేనేమన్నాను చెప్పూ! లేనిపోని చికాకు నీకెందుకూ అనేగా...

సుశీల : ఇంతకంటె ఏం బయటపడుతుందిలెండి ... బహుశా అన్నీ తెలుసుకుంటే మనస్సు కొంత స్థిమితపడుతుందేమో ?

వాసు : (ఏదో అంతరార్థం గ్రహించినట్లు) ఓహో, అలాగేం ?

సుశీల : ఏమిటలాగేం, అని దీర్ఘాలు ?

వాసు : (వెటకారంగా) ఇంతవరకు నీవనుభవించావుకదూ, యిక నే నా బాధపడితే చూడాలని, చూచి సంతోషించాలని ?

సుశీల : నన్ను గురించి యిదా నీ అభిప్రాయం ! సమయం మించి పోకుండానే గ్రహించాను. సంతోషించాను !

వాసు : (కంగారపడుతూ) అదికాదు సుశీ, నేనేమన్నాను చెప్పూ ?

సుశీల : అనవలసినదంతా అనేశావు ! నామీదనీకేమాత్రం గౌరవం అభిమానంవుంటే అలా అంటావా ? శకుంతల ఇంట్లోనుంచి ఆమెనలా వెళ్ళగొట్టాను కాబట్టి, నేను అల్పత్వం, ఈర్ష్యతో కుళ్లిపోయే మనిషినని నీ ఉద్దేశ్యం !

వాసు : (ఆందోళనతో) నేనలా అన్నానండీ ? అలా అంటే పొ పాటే ! క్షమించు !

సుశీల : ఎందుకూ, నామీద ఆమాత్రం నమ్మకం నీకు లేనప్పుడు.. సరిగ్గా ఇలాంటి సమయంలో !

ఇన్స్పెక్టర్ : (గంభీరంగా) సుశీలగారూ, మీరు కొంచెం ఆగండి. (వాసుతో) సుశీలగారు యిక్కడెందుకు వుంటానంటున్నారో నేనుచెప్తాను వినండి. ఈవేళ మధ్యాహ్నం నిండుజవ్వనంలో ఉన్న ఒక స్త్రీ జీవితంమీద రోతపుట్టి నిరాశతో గుండె చీలుకుని, అతి నికృష్టంగ ఆత్మహత్య చేసుకుంది !

సుశీల : (దుఃఖభారంతో) ఇంకొద్దు ! నేనిక భరించలేను. ఇప్పటి ఆపడొక భూతంలా నన్ను వెంటాడుతోంది !

ఇన్స్పెక్టరు : ( ఆమాటలు విన్పించుకోకుండా ) ఆమెను తనెం అన్యాయం చేసిందో ఇప్పుడు గ్రహించారు. కాని యీకే

యిప్పుడే వెళ్ళిపోతే, తర్వాత విషయాలు తెల్సుకోకపోతే, సావిత్రిని తనే చేతులారా చంపివేశానని తన జీవితమంతా బాధతో కుమిలి పోవచ్చు....

సుశీల: (విషాదంగా) అవును ఆమె చావుకు నేనే కారణం.

ఇన్స్పెక్టర్: ప్రేమికులు తమ కష్ట సుఖాల్ని పంచుకుంటారు కాని అప్పుడప్పుడు తమ పాపాలుకూడా సమంగా పంచుకోవలసి వస్తుంది, (చిరునవ్వుతో) కదూ !

[వాసు జవాబివ్వడు]

సుశీల: (ఆందోళనతో) అవును... నిజం... కాని...

[పద్మావతి ప్రవేశం. హాలులో వాతావరణం గ్రహించకుండా, హాటీగా చురుగ్గా నడుస్తుంది.]

పద్మ: నమస్కారం, ఇన్స్పెక్టరుగారూ !

ఇన్స్పెక్టర్: నమస్కారమండీ !

పద్మ: మీరెందుకొచ్చారో మావారు చెప్పారు — కాని, వారు చాలఆందోళన పడుతున్నారు ! ఎవరో చచ్చినదాన్ని గురించి మమ్మల్నడిగితే ఏం ప్రయోజనం చెప్పండి.

సుశీల: అదిగో ! ఆమాట అనవద్దమ్మా !

పద్మ: (ఆశ్చర్యంగ) ఏమిటె సుశీలా, అది ?

సుశీల: చెపితే నీకు బోధపడదు !

పద్మ: ఏమిటది ?

సుశీల: ఆపిడకి మనకి చాల సంబంధం వున్నట్లు ఇంతవరకూ రుజువు చేశారీయన. ఇప్పుడు నీవు వచ్చి ఏం ప్రయోజనమంటే ఎలా కుదురుతుంది !

పద్మ: నీ వనే దేమిటో స్పష్టంగా కావడంలే......

సుశీల : మేమంతా మొదట యిలాగే ధైర్యంగా మాకేం పట్టన
ప్రారంభించాము. కాని యీరోజున విచారణ మొదలుపెట్టి
దానితో మాగుండెల్లో చీకట్లు కమ్మాయి.

పద్మ : ఏమిటి? అమ్మాయి యింతలోనే ఇలా మారిపోయిం

ఇన్స్పెక్టర్ : అవును. లేత మనస్సులు సులభంగా చలిస్తాయ
మా కనుభవమే !

పద్మ : ఇలా అలసిపోయినట్టున్నావేం, సుశీ ! ఇక ఈపాడు కే
మరిచిపో ! లోపలికెళ్ళి కొంచెంసేపు పడుకోఅమ్మా !

సుశీల : నేను వెళ్ళలేనమ్మా ! ఆవిడెందుకు చచ్చిపోయిందో తెలు
సుకుంటేనేగాని నాకు మనశ్శాంతి ఉండదు !

పద్మ : వట్టి అనవసర కుతూహలం! వెళ్ళు తల్లీ ! నామాటవిన

సుశీల : కాదు నేను వినితీరాలి... నేను వెళ్ళను !

పద్మ : అమ్మమాట కాదనకు ! ఆవిడెందుకు చచ్చిందో ఇక్క
మనకెలా తెలుస్తుందే ? ఎంతమంది చావడంలేదు, ఎంతమం
ఉరిపోసుకోవడంలేదు ! (సుశీలను లోపలికి పంపాలని భుజ
మీద చెయ్యి వేస్తుంది) అసలదెటువంటి మనిషో ఏమో !

సుశీల : (ఏదోఉపద్రవం జరిగిపోతున్నట్లు) అదిగో ! అమ్మా
నామాటవిను అలాఅనకు, బాగుండదు ! (వెళ్ళకుండా తిరి
యథాస్థానానికి వస్తుంది.)

పద్మ : బాగుండక పోవడమేమిటి ? నాకేమి బోధ పడటంలేదు
ఇన్స్పెక్టరుగారూ ! ఏమిటండీ ! దీనిఅర్థమేమిటో తెలుసునా

ఇన్స్పెక్టర్ : ఓ, క్షుణ్ణంగా !

పద్మ : ఏమన్నారూ ?

ఇన్స్పెక్టర్ : నాకుబాగా అర్థమయిందన్నాను.

పద్మ : (కోపంగా) ఈ కేసు విషయంలో మీరుచేస్తున్న విచారణ
చాల విపరీతంగా అసందర్భంగావుంది ! విచారణచేస్తే ఎక్క
డవసరమో అక్కడే కానివ్వండి ! మా ఇంట్లో ప్రవేశిం
మాకున్నమర్యాదల్ని రచ్చకీడుస్తారేం ! మా హోదా, ప్రతిష్ఠమీద

తెలియక పోవచ్చు. మావారు మూడుసంవత్సరాలు జిల్లాబోర్డు ప్రెశిడెంటు చేశారు. ఈజిల్లాలోనేకాదు, ఈరాష్ట్రంలో ఎక్కడడిగినా మీకు తెలిసేది!

వాసు: ఇన్‌స్పెక్టరుగారికివన్నీ తెలుసునండీ!

ఇన్‌స్పెక్టర్: (నిర్లక్ష్యంగా) ప్రసాద్ గారేరి?

పద్మ: ఇప్పుడే వస్తారు. మోహన్ దగ్గర కూర్చున్నారు. ఎంచేతో గాని యిందాకటి నుంచి గాభరాగా ఉన్నాడు... మీవల్ల మోహన్‌కు కూడా జబ్బు పట్టుకుంది.

ఇన్‌స్పెక్టర్: నావల్ల జబ్బులేవీ పట్టుకోవు... (నవ్వుతూ) అసలు కారణం ఏమిటండీ?

పద్మ: మావారు ఏదో స్పెషల్ షర్బత్ చేయించారు లెండి, అది బాగుంటుందని ఎక్కువ తాగేశాడు. వికారం చేసి వుంటుంది.

ఇన్‌స్పెక్టర్: ఆమాత్రానికేనా?

సుశీల: ఆఁ! ఏమోలెండి యీమధ్య మోహన్ కొంత అయోమయంగా ప్రవర్తిస్తున్నాడు.

పద్మ: (సుశీలతో) అదంతా ఇప్పుడెందుకు?

[ప్రసాద్ ఎదుటి గుమ్మంద్వారా ప్రవేశం]

ప్రసాద్: (విసుక్కుంటూ) వాణ్ని వెళ్ళి పడుకోమంటే ఎంతచెప్పినా వినడు. (ఇన్‌స్పెక్టరుతో) తనతో మాట్లాడవలసిన అవసరం ఉంటుందన్నారట?

ఇన్‌స్పెక్టర్: అవును.

ప్రసాద్: ఎందుకు?

ఇన్‌స్పెక్టర్: ఎందుకయినాఅవసర ముండొచ్చు.

ప్రసాద్: అవసరముంటే వెంటనేపిలిచి అపనేదో కానివ్వండి. తరవాతనయినా స్థిమితపడతాడేమో!

ఇన్‌స్పెక్టర్: ఇప్పుడుకాదు, ఇంకా కొంతవ్యవధివుంది!

ప్రసాద్: (కోపంపట్టలేక) ఇన్‌స్పెక్టరుగారూ! మీకిదివరకేచెప్పాను

మీ ధోరణిగాని, మీ విచారణ పద్ధతిగాని మాకే మాత్రం నచ్చటం లేదు.

ఇన్‌స్పెక్టర్: ఇది నా ఉద్యోగధర్మం. మీ కిష్టం లేకపోయినా, నా డ్యూటీ నేను చేయకతప్పదు.

సుశీల: (నిరాశగా) ఇంతవరకు జరిగిందంతా మనకిష్టముండే జరిగిందా?

ప్రసాద్: (పెద్దగా) సుసీ! నీవు కొంచెంసేపు నోరుమూసుకుని కూర్చో లేవూ?

పద్మ: ఏమో పోయి పడుకోమంటే కదలదు! (ఒకసారి కోపం విసుగుతో ఇన్‌స్పెక్టరు వంక తిరిగి) అయితే మీరింకా ఏం తెల్సుకోవాలో త్వరగా చెప్పండి......

[అందరు నిశ్శబ్దంగా, భయంతో ఎదురు చూస్తారు]

ఇన్‌స్పెక్టర్: గత వేసవిలో సావిత్రి, గార్ప్రకాశరావుగారిల్లు విడిచి పెట్టినప్పటినుంచి, తనపేరు ప్రేమలత అని మార్చుకుంది. దానితో తనజీవితంగూడ పూర్తిగా మారిపోయింది. (వాసు వంక తిరిగి) వాసుదేవరావుగారూ! మీరామె నెప్పటినుంచి ఎరుగుదురు?

[శివరామప్రసాద్, పద్మావతి "ఏమిటీ" అంటారు ఆశ్చర్యంగా]

వాసు: నాకు తెలుసునని మీకెలా తెలుసు?

సుశీల: వాసూ ఇక లాభంలేదు, అనవసర కాలయాపన తప్ప...

ఇన్‌స్పెక్టర్: ప్రేమలత పేరువినగానే బయటపడిపోయారు. మీ కామెతో బాగా పరిచయం! చెప్పండి!

సుశీల: నేనూ కనిపెట్టేను.

ఇన్‌స్పెక్టర్: మీరామె నెప్పుడు, ఎక్కడ చూచారు?

వాసు: (చెప్పదామా, వద్దా అనుకుని, ఆఖరికి అయిష్టంగా) మొదసారి గత మార్చిలో గాబోలు చూచాను. గెయిటీ కారవాలుల్లో - ఒకసారి మద్రాసులో జరిగిందే - అది!

సుశీల : కాకపోతే ధర్మనగరంలో జరిగిందని యిక్కడెవరూ అనుకో లేదులెండి!

వాసు : థ్యాంక్స్, నీవీవిధంగా చాలా సహాయపడతావని నాకు తెలుసు!... (కూతకేస్తూ) సుశీ! నీపాత్ర నిర్వహించడం అయిపోయింది. ఇకముందు రాబోయే విషయాలనెలాగా అసహ్యించుకుంటావు. ఎందుకిక్కడవుండటం — చెప్పు! నామాట విని లోపలికిపో!...

సుశీల : ఎవరేమన్నాసరే, యిది పూర్తయేవరకు యిక్కడినుండి కదలను.

ఇన్‌స్పెక్టర్ : ఆఁ! వాసుదేవరావుగారూ? ఆతరువాత? చెప్పాలి!

వాసు ; ఒకరోజు ఏవోపనులతో మనసు చికాకుగావుంటే విశ్రాంతి, వినోదం రెండుదొరుకుతాయిగదా అని ఆగంయిటీ కార్నివాలుకి వెళ్ళాను. అక్కడికి చేరుకునేసరికి రాత్రిమించిపోయింది. అన్నీ మూసేస్తున్నారు. ఒక నాచ్‌పార్టీమాత్రం ఇంకా జరుగుతూవుంది. అక్కడికి వెళ్లాను...

ప్రసాద్ : కాని యీవిషయాలన్నీ యిప్పుడిక్కడెందుకు చర్చించడం? అదీగాక... (పద్మనుచూచి, సుశీలవంక సైగచేస్తాడు.)

పద్మ : సుశీ, నీవు లోపలికి వెళ్లు.

సుశీల : నేను వెళ్ళనమ్మా! మీరందరు వింటున్నప్పుడు, నేనేనా ఏం తెలుసుకోగూడనిది?

వాసు : (ప్రాధేయపడుతూ) సుశీ! నామాటవిని లోపలికిపో!

ఇన్‌స్పెక్టర్ : ఆతరవాత ఏం జరిగిందండీ?

వాసు : నాకక్కడవుండడం అంత యిష్టంలేదు. మొఖంనిండా రంగులు పూసుకొని దిష్టిబొమ్మల్లా తిరిగేవాళ్ళను చూస్తే నాకు పరమ అసహ్యం. కాని వాళ్ళ మధ్యనే ఒక చక్కటి అమ్మాయుంది. అక్క డుండవలసిన వ్యక్తి కాదు...! ఆమెలో కృత్రిమ

మేమీ లేదు. గుండ్రని ముఖం, వాలుకళ్లు, ఎర్రని పెదవులు, సన్నటి నడుము... (ఆపేస్తాడు— ఉపద్రవంగా) ఓ, గాడ్ !

ఇన్స్పెక్టరు : ఏం ? ఏం జరిగింది ?

వాసు : (తత్తరపడుతూ) క్షమించండి, ఏమీ లేదు. హఠాత్తుగా నాగుండెల్లో పొడిచినట్లయింది... ఆ అందం అంతా బూడిద పాలయింది, పాపం !

ఇన్స్పెక్టర్ : (కర్కశంగా) అవును, ఏసిడ్‌లో కరిగిపోయింది ?

సుశీల : (ప్రసాద్ నుద్దేశించి ఆక్షేపణగా) మనిద్దరం కలిసి చంపేశాము !

పద్మ : సుశీ, పిచ్చిగా వాగకు !

ఇన్స్పెక్టర్ : ఊఁ ! ఆ తరవాత ?

వాసు : చుట్టూ అందరూ దొరికినవాళ్ళతో తందనాలాడుతూ వుంటే యీ అమ్మాయిమాత్రం ఏదో ఆలోచిస్తూ ఓమూలకూర్చుంది. ఇంతలోనే మనరమణయ్యశాస్త్రి, తప్పత్రాగి పళ్ళికిలించుకుంటూవచ్చి, ఆవిడప్రక్కకూలపడి ఏవో అపభ్రంశాలు మాటలాడడం మొదలు పెట్టేడు.

పద్మ : మన ఆనరరీ మేజస్ట్రేటు—రమణయ్యశాస్త్రి కాదు కదా కొంపతీసి !

వాసు : ఆఁ ను నే ! ఆయనంత వ్యభిచారిని కాని తాగుబోతుని కాని నేనెక్కడా చూడలేదు.

పద్మ : (పిడుగుపడ్డట్టు) మన రమణయ్య శాస్త్రి ?

సుశీల : మీకు వింతేమోకాని, పట్టణంలో అందరికీ కాస్తోకూస్తో తెలుసు ఆపెద్దమనిషిని గురించి ! నాకు తెలిసిన ఒకమ్మాయి ఏదో సర్టిఫికేట్ మీద సంతకం పెట్టించుకోవలసివచ్చి వాళ్ళింటికి వెళ్ళింది...పావం, ఎంతో కష్టంమీద పెనుగులాడి చిరిగిపోయిన జాకెట్టుతో బయటపడింది !

పద్మ : (వారిస్తూ) సుశీలా !

ఇన్స్పెక్టర్ : (వాసుతో) ఆ తరవాతండీ ?

వాసు : నేనావిడవంక చూస్తూంటే, అతిదీనంగా, నన్ను రక్షించండి అంటూ చూచింది పాపం! నాకుచాలా జాలివేసింది. ఆయన దగ్గరికెళ్ళి మీకొక టెలిఫోన్ కాల్ వచ్చింది. మేనేజర్ ఆఫీసు కెళ్ళండి అని చెప్పి పంపించేసి, మేమిద్దరం బయటపడ్డాం!

ఇన్‌స్పెక్టర్ : అక్కడి నుంచెక్కడి కెళ్లారు? నిజం చెప్పండి!

వాసు : నిజమే చెపుతున్నాను. మెజస్టిక్ హోటలుకు వెళ్ళి ఏదో తిన్నాము. కొంతసేపు అవీ ఇవీ మాట్లాడేము. మనసువిప్పి మాట్లాడాలన్న ఆశ పాపం! భావపూరితమయిన మనిషి! ఆశాస్త్రి వెధవ చేసిన చేష్టలకి చాలా బెదిరింది పాపం!

ఇన్‌స్పెక్టర్ : తన గురించేమయినా చెప్పిందా?

వాసు : నే నెంతో అడగ్గా అడగ్గా చెప్పింది. కాని ఏం లాభం? అంతా, ప్రయత్నపూర్వకంగ అస్పష్టంగ చెప్పేది. ఏవిషయం ఇదమిత్థమని తేల్చేదికాదు. ఎన్ని చెప్పినా తను ప్రేమలతగానే మాట్లాడేది, కాని, సావిత్రి అన్న పేరు తన నోటంట ఒక్కసారయినా రాలేదు. అసలాపేరు వినడం నాకిదే మొదటిసారి.

ఇన్‌స్పెక్టర్ : ఆతరవాత ఆమెను మీ దగ్గరే వుంచుకున్నారుకదూ?

పద్మ : ఏమిటీ!

సుశీల : (కటువుగా) యింతవరకు విన్న తరవాత యిక యింకేముంది?

వాసు : ఆవిడ కొక దమ్మిడీ అయినా చేతికొచ్చే అవకాశం లేదనీ, తలదాచుకొనే నీడకూడా లేదని తేలింది. ఆ రోజుల్లోనే నా స్నేహితుడొకడు ఇంగ్లండు వెడుతుంటే, తిరిగి వచ్చేవరకు వుండ వచ్చునని అతని గది తాళం తీసుకున్నాను.... అక్కడ వుండవలసిందని ఎంతో పట్టుబడితే ఆఖరికి ఒప్పుకుంది. చేతి ఖర్చుకు కొంతడబ్బుకూడా యిచ్చాననుకోండి! (ఇన్‌స్పెక్టర్‌నుద్దేశించి) కాని, ఆమెను మొదట నే నేఉద్దేశంతో తీసుకు వచ్చానో మీరు గ్రహించాలి. నీచమయిన ఆకార్నవాలు జీవితంనుంచి ఎలాగయినా ఆమెను రక్షించడం నాధర్మం

అనుకున్నాను. ఆ ఉపకారానికి నేనేమీ బదులుకూడా అపేక్షించలేను.

ఇన్‌స్పెక్టర్ : ఓహో, అలాగా !

సుశీల : అవును కాని, ఆ సంగతి ఆయనతో చెప్పుతావేం ? నేనిక్కడ లేనూ ?

వాసు : నిజమే సుశీ, క్షమించు. అదేమిటోగాని ఇవాళ...

సుశీల : (తెంపుచేసి) అవును. అదేమిటోగాని, ఇవాళమాత్రం మీరాయన గుప్పిట్లో చిక్కుకుపోయారుకదూ !

ఇన్‌స్పెక్టర్ : ఎలాగయితేనేం - ఆవిడతో కొన్నాళ్లు గడిపేరు ! అవునా ?

వాసు : అవును. ఆమెది మెత్తని మనస్సు. నేను చేసిన మేలుకి తనకు చేతనయినంతవరకు కృతజ్ఞతచూపకపోతే, ఆమె మనస్సు చాల బాధపడేదనుకుంటాను...

ఇన్‌స్పెక్టర్ : కాదుమరీ ? ఒక్కర్తె ! యౌవనంలో వుంది. ఇంకే విధంగా కృతజ్ఞత చూపగలదు పాపం ! ... మీ రామెను ప్రేమించారా ?

సుశీల : సరిగ్గా నేను అదే అడగాలనుకుంటున్నాను.

ప్రసాద్ : (కోపంగా) అంతకంతకు శృతిమించుతుందే !

ఇన్‌స్పెక్టర్ : (చురుక్కు అతనివంక తిరిగి) శృతిమించడానికేముంది ? యీనాటకానికి నాందిపాడింది మీరుకాదూ ?

ప్రసాద్ : నాపరిస్థితిలో ఎవరున్నాసరె అలాగేచేసి వుండేవారు. ఇందులో నాబాధ్యతేముంది ! కానియిప్పుడు నాఅమ్మాయిని కూడ ఈకేసులోకి యీడ్వడం నాకేమాత్రంయిష్టంలేదు ?.. యీ వెధవకేసులోకి !

ఇన్‌స్పెక్టర్ : (వ్యంగ్యంగా) ఏం ? ఎందుకూ ? మీఅమ్మాయిగారేమన్నా ఆకాశంనుంచి ఊడిపడ్డారా ?

సుశీల : నేనింకా చిన్నపిల్లనుగాదు నాన్నగారూ, నాకీవిషయం తెలుసుకోడానికి హక్కుంది. (వాసుతో) నీవామెను ప్రేమించావా? నిజంచెప్పు!

వాసు : ఆవిడ చూపించినంత మమత నాకావిడ మీదుండేదిగాదు. ఎంచేతోగాని...

సుశీల : (ద్వేషంతో) ఆశ్చే ఎందుకుంటుంది? ఆవిడదృష్టిలో మీరు సప్తసముద్రాలు దాటివచ్చిన రాజకుమారులు...మీదంతా ఎంతో దివ్యంగా వుండేదికదూ?

వాసు : (తెప్పరిల్లి) అవును అయితే ఏమంటావు మగవాడయిన వ్యక్తి ఎప్పుడో ఒకసారి అటువంటిది జరగటం ఏమంత పెద్ద విశేషంగాదులే?

సుశీల : (తృప్తిగా నవ్వుతూ) ఈరోజంతటికీ ఒక్కసారి నిర్భయంగా సత్యం పలికావు. సంతోషించాను...ఇంతకీ ప్రతిరోజు వెళ్ళేవాడివా దానిదగ్గరకి?

వాసు : ఆరోజుల్లో నాకు నిజంగా చాలా పనివుండేది, సుశీ! నీవు చెపితే వినవు!

పద్మ : (విసుగ్గా) చాల్లెండి! యీచీడ కథ! ఇంతకంటె వివరాలు అనవసరం.

సుశీల : నాకవసరం! యింతకీ వివరాలేమీ తేలలేదే?

వాసు : ఇంత కంటె నేనేంచెప్పగలను!

ఇన్స్పెక్టర్ : (అందుకొని) ఈవ్యవహారం ఆఖరికి ఎలాముగిసింది?

వాసు : (తప్పనిసరియై) కొన్నాళ్ళతర్వాత ఏదోపనిమీద బొంబాయి వెళ్ళవలసి వచ్చింది. వెళ్ళేముందు అంతా తెగతెంపులు చేసుకున్నాను.

ఇన్స్పెక్టర్ : ఆ తరవాత తనగతిఏమిటని అడిగింది కదూమీనిన్నాళ్ళి?

వాసు : తన కష్టాలను తనే దిగమింగుకుంటూ భరించి పోతానంది.

సుశీల : మీకు చాల శ్రమ తగ్గించిందన్నమాట.

ఇన్స్పెక్టరు : అప్పుడేమన్నది?

వాసు : (ఒక్క క్షణం ఆగి, వ్యాకులత స్ఫురించే ధ్వనితో) ఆఖరిసారి చూడ్డాని కెళ్ళినప్పుడు, తన మనసంతా విప్పి ఒక్కసారి భోరున ఏడ్చింది. తన జీవిత మంతటిలోనూ ఆనందంగా, నిశ్చింతగా గడపిన రోజు లవేనట — తన మనసులో ఎన్నో ఆశలు రేకెత్తించానట. కాని యీఆశలన్నీ ఒకనాడు ఆర్చుకు పోతాయని మొదటి నుంచీ భయపడుతూ వుండేదట. అలా విడిచేసినందుకు ఆఖరికీ నిందించనన్నా లేదు.

ఇన్‌స్పెక్టర్ : ఆతరవాత ఆ యిల్లుకూడా విడిచిపెట్టింది ?

వాసు : అవును! వెళ్ళిపోయేటప్పుడు ఎంతో బలవంతం చేయగా, నాదగ్గర కొంత డబ్బుతీసుకుంది.

ఇన్‌స్పెక్టర్ : ఆతరవాత తనేమి చేయదల్చుకుందో చెప్పిందా ?

వాసు : లేదు ! కాని, తనమాటలను బట్టినేను గ్రహించిన దేమంటే మద్రాసు విడిచి, ఏదయినా ఒకచిన్నవూళ్ళో కొన్నాళ్ళు ఒంటరిగా గడపాలనుకుంది ! వెళ్ళిందోలేదో నాకుమాత్రం తెలియదు ! (భయంతో) ఏం వెళ్ళిందా ఎక్కడికయినా ?

ఇన్‌స్పెక్టర్ : వెళ్ళింది. సుమారు రెండు నెలలు, తన చేతిలో డబ్బయి పోయేవరకు చిత్తూరులో వున్నది !

వాసు : మీకిదెలా తెలుసు ?

ఇన్‌స్పెక్టర్ : ఆవిడ రాసినవుత్తరంవల్ల (ఒకవుత్తరం జేబులోనుంచి తీసిచదువుతాడు) "ఈ అయిదారు నెలలూ నేనుఅనుభవించిన సుఖాన్ని ఒంటరిగా కూర్చుని నెమరువేస్తూ గడిపితే, మరి కొన్నాళ్లు యీ సంఘంలో నాఆత్మగౌరవం కాపాడుకోవచ్చు అటువంటిసుఖం, ఆనందం, నాజన్మలో యిక దొరకదు. మళ్ళీ నేను సంఘంలోకి నాజీవనోపాధికోసం వెడితే ఎన్నెన్ని ఘోరాలు జరుగుతాయోగదా ?" (ఉత్తరంమూసి వాసు వంక) ఆదొరికినదాన్నే మరికొన్నాళ్లు సరిపుచ్చాలని ఆశ, పాపం !

వాసు : (విషాదంగా) అంతే, అదే ఆఖరుసారి ఆమెను చూడడం (నిట్టూర్పు) అంతకంటే నేను చెప్పవలసిందింకేమీ లేదు.

ఇన్‌స్పెక్టర్ : (చిరునవ్వుతో) మీ. వద్ద తెలుసుకోవలసిందికూడా ఇంకేమీ లేదు.

వాసు : అయితే, నేను బైటికిపోతాను. తలనొప్పిగావుంది.

ఇన్‌స్పెక్టర్ : ఇంటికి వెడతారా ?

వాసు : లేదు, వూరికే అలా గాలిలోకి వెళ్ళివస్తాను.

ఇన్‌స్పెక్టర్ : సరే, వెళ్ళండి.

[వాసు వెడుతూ దారిలోనున్న సుశీలవద్ద ఒక్క క్షణం నిలబడతాడు]

సుశీల : ఒకవేళ మర్చిపోయిగాని తిరిగిరావేమో, నీ విచ్చిన వుంగరం నీ దగ్గరే వుంచుకో (వుంగరం యిచ్చేస్తుంది)

వాసు : (నీరసంగా తీసుకుంటూ) ఇలా జరుగుతుందని అనుకుంటూనే వున్నాను.

సుశీల : ఒకపావుగంటముందు నీమీదవున్న కోపం యిప్పుడు లేదు ! గత వేసవిలో నీవు చెప్పిన సాకులన్నీ నిజంకావని నాకు తెలుసు, — అప్పుడే గ్రహించాను. ఏదో తెలియరాని అవి నీతిలో మునిగితేలుతున్నావని. ఇన్నాళ్ళకు నిజం తెలిసింది ! ప్రేమలత అనాథ అయి నీ దగ్గరకు రావడానికి నేనేకారణం మనిద్దరం యీ పార్టీ ప్రారంభంలోనున్న వ్యక్తులంకాము. ఇంతలోనే మనము చాలా మారిపోయాం !

పద్మ : సుశీ ! ఈ చిన్న విషయాలన్నీ ఎందుకే అలా మనసుకు పట్టించుకుంటావు ? తప్పు ! ఈ స్వల్ప విషయాలకే బాధ పడితే ఇంకెలా బ్రతుకుతాం !

సుశీల : నీకు తెలియదమ్మా ! నీవూరుకో !

వాసు : నీవు చెప్పింది అర్థమయింది. (ప్రార్థిస్తున్నట్లు) సుశీ ! నేను మళ్ళీ తిరిగివస్తాను...నీకిష్టమైతే...సరేనా ?

పద్మ : (వెళ్లిపోతున్న వాసువంక దిగులుగాచూస్తూ, ఇన్‌స్పెక్టరు వంక చటాలున తిరిగి, కోపం, అసహ్యంతో) ఇప్పటికయినా

మీ విచారణ పూర్తయిందా? మమ్మల్ని శాంతంగా బ్రతక నిస్తారా?

వాసు: (వెనక్కి తిరిగి) నాకేమీ నమ్మకంలేదు - సరే - వెళ్లివస్తా.

[వాసువెనుక తలుపు మూసుకుంటూవుంటే అందరూ నిశ్శబ్దంగా చూస్తారు]

సుశీల: ఆయనకి ప్రేమలత ఫోటో చూపించారా?

ఇన్స్పెక్టర్: లేదు. అనవసరమని చూపించలేదు.

పద్మ: ఆఫోటో మీదగ్గరేవుందా యిప్పుడు!

ఇన్స్పెక్టర్: ఉంది, మీరోకసారి చూస్తారా?

పద్మ: (బెదురుతూ) నేను చూడడం ఎందుకు?

ఇన్స్పెక్టర్: ఏమీ లేదు. ఒకసారి చూడడం మంచిది.

పద్మ: (అయిష్టంగా) ఏదీ?

[ఇన్స్పెక్టర్ జేబులోనుంచి ఒకఫొటోతీసి చూపిస్తాడు. పద్మావతి పరీక్షగా చూస్తుంది పరిచయమున్న వాళ్ళనే చూస్తున్నట్టు ముఖంలో మార్పు కలవరం]

ఇన్స్పెక్టర్: (ఫొటో జేబులోపెట్టుకుంటూ) పోల్చుకో గలరా?

పద్మ: నేనెలా పోల్చుకోగలను!

ఇన్స్పెక్టర్: ఆతరవాత కొంచెంమారి వుంటుందిగాని అంతగా భేదం వుండకూడదే!

పద్మ: (భయంతో) మీరుచెప్పేది నాకేమీ అర్థం కావడంలేదు!

ఇన్స్పెక్టర్: (కొంచెంగట్టిగా) మీరు నిజం చెప్పడంలేదు.

పద్మ: ఏమిటీ?

ప్రసాద్: (కోపంగా) ఇన్స్పెక్టరుగారూ, మీరిలా అపసవ్యంగా ప్రవర్తిస్తే ఇకసహించలేము...మాది, మర్యాదగల కుటుంబం ...మాజమీందారీలో, నాహయాంలో......

ఇన్స్పెక్టర్: ఇక మీ బెదరింపులు కట్టిపెట్టండి! నాడ్యూటీనేను చేస్తున్నాను! యిది కేసువిచారణ, ఆషామాషీ కబుర్లుకా తెలిసిందా?

ప్రసాద్ : (క్రోధంతో) విచారణే చాలా అసభ్యంగానూ, అపసవ్యంగానూ చేస్తున్నారు? ఇంతకీ మేము పెద్దమనుష్యులంకాని.....!

ఇన్‌స్పెక్టర్ : (నొక్కి-రిస్తూ) పెద్దమనుష్యులు, సభ్యత! పెద్దమనుష్యులకి కూడా కొన్ని హద్దులూ, బాధ్యతలూ వున్నాయి. యింత వరకు చూస్తున్నాంగా పెద్దమనుష్యుల్లో ఎంత పెద్దరికం వుందో!

ప్రసాద్ : మాటలు జాగ్రత్తగా రానివ్వండి!

సుశీల : (కలుగజేసికొని) నాన్నగారూ! ఎందుకీ అనవసర కోపతాపాలు? సూక్ష్మంలో తేలిపోయే విషయం. ఆ ఫోటో చూడగానే పోల్చుకున్నట్లు అమ్మముఖంలో స్పష్టంగా తెలిసిపోయింది...... మనం నిజం చెప్పడానికి భయపడుతున్నప్పుడు ఇన్‌స్పెక్టరుగారలా అన్నారంటే తప్పేముంది?

[బయట గట్టిగా వీధి తలుపు మూసిన శబ్దం]

ప్రసాద్ : మళ్ళీ తలు పెవరో తడుతున్నారు.

పద్మ : వాసు తిరిగి వచ్చేసి వుంటాడు.

ఇన్‌స్పెక్టర్ : బహుశా, మీఅబ్బాయి బయటికి వెళ్ళివుంటాడు.

ప్రసాద్ : (చురచుర చూస్తూ) మీ రుండండి! నేనుచూసివస్తాను.

[ఎదుటి ద్వారం లోంచిపోతాడు]

ఇన్‌స్పెక్టర్: పద్మావతిగారూ! మీరు లలితా అనాధశరణాలయం మేనేజింగ్ కమిటీలో సభ్యులు కదండీ?

[పద్మావతి జవాబు చెప్పదు]

సుశీల : అవునమ్మా, ఒప్పుకోడంలో తప్పేముంది? (ఇన్‌స్పెక్టరుతో) అవును. ఏం? ఎందుకు?

ఇన్‌స్పెక్టర్ : అనాధ స్త్రీలకు సహాయం చేయడానికి కదూ, ఈ శరణాలయం కట్టేరు?

పద్మ : అవును. బీదలయివుండి, అర్హులయిన స్త్రీలకు అన్నివిధాలా సహాయం చేస్తుంది.
ఇన్స్పెక్టర్ : ఒకవారంరోజులక్రితం మీశరణాలయానికిఒకఅమ్మాయి వచ్చింది, వైద్యసహాయంకోసం, జ్ఞాపకంవుందా ?
పద్మ : వుంది !
ఇన్స్పెక్టర్ : మీరారోజు అక్కడేవున్నారు ?
పద్మ : అవును, కాని, అదంతా యిప్పుడెందుకు ?

[శివరామప్రసాద్ ప్రవేశం, కలవరంగా వుంటాడు]

ప్రసాద్ : ఆఁ వెళ్ళింది మోహనే !
పద్మ : గదిలో చూచారా ?
ప్రసాద్ : చూచాను. మేడమీదకూడా కనబడలేదు !
పద్మ : ఎక్కడికి వెళ్లివుంటాడు ?
ప్రసాద్ : ఏమో, ఈరోజంతా, చాల విపరీతంగా వెర్రెత్తినట్టు ప్రవర్తిస్తున్నాడు ! ఇలాంటప్పుడు వాడు బైట ప్రశాంతంగా షికారుచెయ్యడమే మంచిదిలే !

ఇన్స్పెక్టర్ : ఆయనతో ఇక్కడ అవసరంరావచ్చు !
సుశీల : చల్లగాలికోసం బయటికి వెళ్లివుంటాడు, ఇప్పుడే తిరిగి వచ్చేస్తాడులెండి !
ఇన్స్పెక్టర్ : అలాఅయితేసరే ! నాశ్రమ తగ్గించిన వారవుతారు.
పద్మ : ఎందుకండి, అంతశ్రమపడవలసిన అవసరం ?

ఇన్స్పెక్టర్ : ముందు నావిచారణ కానివ్వండి ! తరువాత మీ ప్రశ్నలకి సావధానంగా జవాబు చెప్తాను................ వాసుదేవరావుగారు సావిత్రినిఒకసంవత్సరంనుంచి చూడలేదట నిజమే అయివుండొచ్చు కాని పద్మావతిగారు ఆమెను ఒక వారంరోజుల క్రితం చూశారు చాలాసేపు మాట్లాడా కూడా ?

సుశీల : (ఆశ్చర్యంగ) అవునా, అమ్మా?
ప్రసాద్ : (ఆశ్చర్యంగ) ఏమిటీ ?
ఇన్‌స్పెక్టర్ : మీ ఆస్పత్రిలో సహాయంచేయమని ప్రాధేయపడింది!
పద్మ : అవును.
ఇన్‌స్పెక్టర్ : సావిత్రి అన్న పేరునకాదు.
పద్మ : ప్రేమలత అన్న పేరునకూడకాదు.
ఇన్‌స్పెక్టర్ : మరేపేరు ?
పద్మ : సూర్యకాంతం, ఇంటిపేరు వేములవాడ అట !
ప్రసాద్ : (ఆశ్చర్యంగ) మన యింటి పేరే?
పద్మ : అవును ! వెధవపోగాలుబోతుతనం. పెంకితనానికి ! నన్నవమా నించడానికి ! అప్పటినుంచి దానిముఖం చూస్తేనే అసహ్యం వేసింది !
ఇన్‌స్పెక్టర్ : మొదటినుంచి మీ కావిడమీద దురభిప్రాయం వున్న దన్నమాట!
పద్మ : అవును వుండదూమరి ? సహజమే !
ఇన్‌స్పెక్టర్ : ఆ శరణాలయం ట్రస్టీలలో అందరికంటె ఎక్కువపలుకు బడివున్న మీవల్లనేకదూ ఆవిడకి సహాయం దొరకలేదు ?
పద్మ : అయివుండొచ్చు నేమో !
ఇన్‌స్పెక్టర్ : (ఖచ్చితంగా) మీవల్లనా, కాదా ?
పద్మ : (చిరుక్కుమని) అవును. దానికైతేం నాకేమీ నచ్చలేదు. ఉచ్చ నీచాలులేకుండా, పెద్దా, చిన్న ఆలోచించకుండా మావంశంపేరు రచ్చకీడ్వడమా ? అది విన్న తరవాత అక్కడున్న వాళ్ళంతా నావైపు వింతగాచూడడం మొదలెట్టేరు! గట్టిగాఅడిగితే, అదితన ఇంటిపేరుకాదు, ఏదో నోటికి వచ్చింది చెప్పేను అనిఅన్నది. తనకసలు పెళ్ళికాలేదని కూడా ఒప్పుకుంది! ఇక అదెలాంటిదో తెలిసిపోయింది!
ఇన్‌స్పెక్టర్ : ఆవిడేం సహాయం కోరింది ?
పద్మ . ఏ సహాయమో మీరీపాటికి గ్రహించి వుంటారు.

ఇన్‌స్పెక్టర్ : లేదు! నేనుగ్రహించలేదు!

పద్మ : యిప్పుడావిషయం చర్చించడం అనవసరం!

ఇన్‌స్పెక్టర్ : మీరీచర్చనుండి తప్పించుకోవడం అసంభవం!

పద్మ : బలవంతంచేసి మీరు నాచేత చెప్పించాలనుకుంటున్నారేమో! మాశరణాలయానికి సహాయంకోరి ఎవరయినావస్తే వాళ్ళ పరిస్థితులనుచూసి అర్హతనుబట్టి యివ్వాలని మా రూల్సులోవుంది. అది చెప్పినవాళ్ళ అబద్ధం అని తోచింది మాకు. చాలా అనుమానంగావుంది. మనిషి ప్రవర్తన. అంచేత సహాయం చేయలేదు. మాడ్యూటీ మేము చేశాము. అంతే...నాతప్పేమీలేదిందులో. యీ సంగతి యింతటితో ముగించండి!

ఇన్‌స్పెక్టర్ : మీరొకపెద్ద ఘోరమయిన అపచారం చేశారు. మీజీవితమంతా యీ అన్యాయం మిమల్ని పీడించుకతింటుంది. ఈవేళావిడ ఆస్పత్రి నేలమీద ఎంత వికృతంగా పడివుందో మీరుచూడవలసింది! అప్పుడు యింత గుండె నిబ్బరంగా మాట్లాడేవారో, లేదో తెలిసేది!

సుశీల : దయచేసి, ఇన్‌స్పెక్టర్‌గారూ! మళ్ళీ ఆవిషయం ఎత్తకండి. ఇంతసేపూ అదే ఆలోచిస్తున్నాను! గుండె ఝల్లుమంటోంది!

ఇన్‌స్పెక్టర్ : మీరు మళ్ళీ యీ సంగతి ఆలోచించేటప్పుడు, అప్పుడామెకు ఎనిమిదో నెల అన్నమాట మరిచిపోకండి.

సుశీల : ఆఁ! ఎంతఘోరం, ఎనిమిది నెలలే, రెండుప్రాణాలనితీసుకుంది, చేతులెలా వచ్చాయో.

ఇన్‌స్పెక్టరు : ఏంచేస్తుంది? రోజురోజుకు బ్రతుకు దుర్భరమౌతుంటే ఇంకేమి చేస్తుంది!

సుశీల : అమ్మా, నీవన్నా గ్రహించలేకపోయావా?

ఇన్‌స్పెక్టర్ : ఆమె గర్భవతి కాబట్టి, మీ అమ్మగారి ఆస్పత్రికి సహాయంకోసం వెళ్ళింది. ప్రసవించేసమయానికి, సౌకర్యాల కోసం.

ప్రసాద్ : (బోనులోపడ్డ సింహం మూల్గినట్లు) ఇన్ స్పెక్టరుగారూ! ఇంతలో.. మన నాసుదేవరావుగారికిగాని ... ...

ఇన్ స్పెక్టర్ : లేదులెండి, ఆయనకు దీనితో యేమీ సంబంధంలేదు!

సుశీల : బ్రతికేం, ఇంతకీ, రెండువిధాలా, నా కొచ్చిందేముందిలే!

ఇన్ స్పెక్టర్ : అసలు మీ రావిడ కేమి చెప్పి పంపారండీ?

పద్మ : వెళ్ళి తన మొగుణ్ణి వెతికి పట్టుకోమన్నాను! అబాధ్యతవాడిది!

ఇన్ స్పెక్టర్ : అంతటితో మీబాధ్యత తీరి పోయిందికదూ! ఏకాకి! నా అనేవాళ్లెవరూ లేరు. డబ్బులేదు, నిరాశ మూర్తీభవించి మీదగ్గరికొస్తే మీరు తోసి పుచ్చారా? స్త్రీ జీవితంలో, అటువంటి అపత్సమయంలో, సహాయమేకాదు,సలహా, సాను భూతి, ప్రేమ ఎంత అవసరం! మీకు తెలియదూ!

సుశీల : ఇదిచాల క్రూరం. నీచమైనపని!

ప్రసాద్ : (గొణుగుతూ) పద్మా! యీ కేసుగాని బయట పడితే, న్యూస్ పేపర్లు దుమ్మెత్తిపోస్తాయి! లేనిపోని అప్రతిష్ట!

పద్మ : (తనగాథ రానుంచి తేరుకొని భర్తతో) ఇకచాలించండిమీరు నామీద నేరం మోపేముందు ఒక్కటిజ్ఞాపకం వుంచుకోండి! మొదట దాన్ని వీధిలోపడేసింది నేనుకాదు-మీరు. నేనుచేసిన దంతా న్యాయమే. మా ఆస్పత్రి పేద వాళ్లకికాని, గంకు ముండలకికాదు. తన మొగు డెక్కడున్నదీ దానికి తెలియదూ? వాడి నెలాగయినా పట్టుకొని, పెళ్లిచేసుకోకపోతే,మనోవర్తి అయినా యిప్పించుకోమన్నాను. అంతేగాని ... ...

ఇన్ స్పెక్టర్ : దానికేం జవాబిచ్చింది?

పద్మ : ఆం! ఏమీ లేదు! మళ్లీ ఏవో అబద్ధాలు, కల్లి, బొల్లి కబుర్లు చెప్పింది.

ఇన్ స్పెక్టర్ : ఏమిటని?

పద్మ : ఏమయినాగానే! అప్పటి నుంచి దానిమీదున్నఆకాస్త సాను భూతి కూడా పోయింది. తనదేవో వున్నతాశయాలు, ఏవో ఆదర్శాలు వున్నట్లు నటించడం మొదలుపెట్టింది.

దొంగతనంగా నీళ్లాడవలసిన మనిషి, నీతి, నియమాలు ఏకరువు పెడుతుంటే, ఎంత అసహ్యాంగా వుంటుంది!

ఇన్‌స్పెక్టర్ : ఇంకకొంచెంసేపట్లో ఆశవం కడుపుకోసి పరీక్షచేస్తారు. ఎలా చచ్చిందా అని - కోస్తూ వున్నప్పటిదృశ్యం ఎప్పుడైనా చూచారా? (శివరామప్రసాద్ అడ్డువచ్చి ఏదో చెప్పడానికి ప్రయాసపడుతుంటే, నిర్లక్ష్యంగా) ఏమిటండీ, మీగాథరా! ఎందుకీ చిందులుతొక్కడం? మీతో కబుర్లు చెప్పడానికి రాలేదు నేను! తెలుసా? ఊఁ, తరువాత, ఏం చెప్పింది?

పద్మ: (చల్లబడి) తన మొగుడు యింకా చిన్నవాడట - చదువు కుంటున్నాడట. తాగుతాడట. అంతవరకూ తనకు డబ్బు తెచ్చి యిచ్చేవాడట, కాని యికముందు ఆడబ్బుతీసుకోదట!

ఇన్‌స్పెక్టర్ : ఏం, ఎందుకు?

పద్మ: ఆఁ, ఏవో గోటువెధవకబుర్లు చెప్పిందిలెండి! ఒక్కమాటా నిజం కాదు!

ఇన్‌స్పెక్టర్ : నిజమా, కాదా, అన్నవిషయం మీరెవరు నిర్ణయించడానికి? ఆమె ఏం చెప్పిందో అదే నాకు కావాలి!

పద్మ: ఏమిచెప్పినా సరే, అటువంటి మనిషి డబ్బుయిస్తానంటే వద్దంటుందా! ఎక్కడయినావుందా?

ఇన్‌స్పెక్టర్ : (కఠినంగా) పద్మావతిగారూ! మీరనవసరంగా కాలం వ్యర్థం చేస్తున్నారు. నేను మళ్లీ అడుగుతున్నాను. ఆడబ్బు పుచ్చుకోకపోవడానికి కారణం ఏమిచెప్పింది?

పద్మ: ఒకనాడు వాడు తాగి మాట్లాడాడట. ఆ తెస్తున్న డబ్బు తనది కాదని ఆ సంభాషణలో తెలిసిపోయిందట.

ఇన్‌స్పెక్టర్ : మరెవరిది?

పద్మ: దొంగ సొమ్మట!

ఇన్‌స్పెక్టరు : అంటే — దొంగ సొమ్ము తినడం యిష్టంలేక మీ దగ్గరికి సహాయం కోసం వచ్చిందన్నమాట.

పద్మ : ఏమోమరి ! నాకుమాత్రం అది అంతా పచ్చి అబద్ధం అని పించింది. అందుచేత శరణాలయం సహాయం చేయలేదు, ఇందులో నాతప్పేమీ లేదు,

ఇన్‌స్పెక్టర్ : ఇంత ఘోరంగా ఆత్మ హత్య చేసుకున్న తరువాత గూడా మీ అపరాధానికి విచారపడరు గదూ ?

పద్మ : అలా చనిపోయినందుకు నాకు విచారమే, కాని నేనువహించ వలసిన బాధ్యత ఏమీ లేదు !

ఇన్‌స్పెక్టరు : అయితే ఎవరి దా బాధ్యత ?

పద్మ : దానిదే !

సుశీల : (వ్యథతో) నాన్నగారూ నేనూ కలిసి అవిడ నలా దిక్కు లేనిదాన్ని చేయబట్టేకదూ యిదంతాను ! పాపం ! పాపం !

పద్మ : ఆతరవాత తన మొగుడి దా బాధ్యత. అదిగాక తను చెప్పి నట్టు వాడేగాని బాగా డబ్బున్న వాడయితే, వాడిని తప్ప కుండా పట్టుకుని, అ భారం వాడిచేతే మోయించాలి ! వెధవకి బుద్ధి వచ్చేటట్టు...

ఇన్‌స్పెక్టర్ : మరి ఆదొంగతనాల సంగతేమిటి ?

పద్మ : ఆదొంగతనాలు అవీచూస్తే అదిచనిపోవడానికి కారణం వాడేఅవుతాడు. ఆవెధవకాని దొంగతనాలు చేయకపోతే యీ ప్రమాదం జరగకనే పోయేదేమో !

ఇన్‌స్పెక్టర్ : అంచేత అసలుదోషివాడే నంటారు !

పద్మ : కాదూమరి ! వాడినెలాగయినా పట్టుకుని కఠినంగా శిక్షిం చాలి ! ఇలా యింకెప్పుడూ ఆడవాళ్ళను అన్యాయం చెయ్య కుండా...

సుశీల : (అకస్మాత్తుగా ఏదో భయంతో) అమ్మా ! ఆగు ! నామాట విను !

పద్మ : నీవూరుకో సుసీ, అనవసరంగా అడ్డుపెట్టకు !

సుశీల : కాదమ్మా; చెపితే బోధపడదు నీకు !

పద్మ : సుసీ ! ఇవాళ పిచ్చెత్తిందా ఏం! ఏమిటీవాలకం !

[సుశీలముఖం చేతులతోమూసుకుని మెల్లగా నడుస్తుంది]

పద్మ : మీరిక్కడుండి అనవసరంగా కాలం వ్యర్థం చేయడంకంటే ఆ వెధవను పట్టుకునే ప్రయత్నాలు చేయకూడదూ?

ఇన్‌స్పెక్టర్ : (వ్యంగ్యంగా) మీరేమీ తొందరపడకండి, నాడ్యూ లో నేనేమీలోపం రానివ్వను! (తన చేతి గడియారంవం చూస్తాడు) వాడి నెలాగయినా బయటపెట్టాలిగదూ? వా నుంచి అందరూ పాఠం నేర్చుకోవాలి గదూ?

పద్మ : తప్పకుండాను – అటువంటి వెధవను విడిచిపెడితే, యింకెంద పిల్లల్ని చెరుస్తాడో! దుర్మార్గుడు! మీపనిఅయిపోతే యి మేం సెలవు తీసుకుంటాం!

ఇన్‌స్పెక్టర్ : ఇప్పుడప్పుడేకాదు. ఇంకా ఒకరి కోసం యెదు చూస్తున్నాను.

పద్మ : ఎందుకు?

ఇన్‌స్పెక్టర్ : తొందరపడకండి!

సుశీల : (దుఃఖం, భయంతో) చూశావా, అమ్మా! చెపి విన్నావా?

పద్మ : (ఇప్పటికి గ్రహించి పిడుగుపడినట్లు) ఏమిటి?

[ఆగిపోతుంది. భర్త, తనూ ఒకరినొకరు భీతులై చూచుకుంటారు]

ప్రసాద్ : (అతినమ్రతతో) చూడండి, ఇన్‌స్పెక్టర్‌గారూ! కొం తీసి మా అబ్బాయికాని యిందులోకి రాడుకదా? అసల వాడు...

ఇన్‌స్పెక్టర్ : ఒకవేళవచ్చినా ఏం చేయాలో మనకు తెలుసు! పద్మా వతిగారిప్పుడే సెలవిచ్చారుగదా!

ప్రసాద్ : (ఆగ్రహంతో) ఆఁ! దుర్మార్గుడు! ఎంతపని చేశాడూ?.. కాని, ఇన్‌స్పెక్టర్‌గారూ!

పద్మ (గుండెచెదిరినట్లు) నేనిది నమ్మను. అంతాఅబద్ధం! అన్యాయం

సుశీల: ఈధోరణి కట్టిపెట్టమని నెత్తి, నోరు కొట్టుకున్నానే, విన్నావూ? మా డిప్పుడేం జరుగుతుందో? (ఏడుస్తూ వుంటుంది)

[ ఇన్‌స్పెక్టర్ చేయి పైకెత్తి ఏదో వింటుంటాడు, నిశ్శబ్దం; వీధి తలుపు తీసిన ధ్వని - అందరూ ఆతురతతో ఆవైపు చూస్తారు. ఇన్‌స్పెక్టరు చాల ప్రశాంతంగా వుంటాడు. మోహన్ ప్రవేశం. మొహాన్ని నెత్తురుచుక్క లేకుండా పేలవంగా వుంటాడు. ఏదో తీవ్రమయిన మనో వ్యధతో బాధపడుతూ, గుమ్మం దగ్గర నిలబడి వుంటాడు. ]

[ తెర ]



# మూడో దృశ్యం

[అంతా ద్వితీయాంకం చివరలాగే వుంటుంది, మోహన్ గుమ్మం దాటి లోపలికివచ్చి నిలబడతాడు ]

మోహన్ : మీకంతా తెలిసిపోయింది కదూ ?

ఇన్‌స్పెక్టర్ : ఇప్పటికి కొంతమాత్రమే తెలిసింది...మిగిలింది మీరు పూర్తి చేయాలి !

[మోహన్ ముందుకు నడిచివస్తాడు.)

పద్మ : నీ పని తెలియక ఎన్నెన్ని మాటలన్నానురా ?

సుశీల : సావిత్రికి ఆదుస్థితి కలిగించినవాణ్ణి అమ్మ ఇంతవరకు చెడ తిట్టిపోసింది. వాడిని తప్పించుకు పోనీయకూడదని, కఠినంగా శిక్షించాలని...

ప్రసాద్ : (వినుగుగా) అదంతా ఎందుకిప్పుడు ?

మోహన్ : (నీరసంగా) ఇంత అధోగతిలో సతమతమౌతున్న నాకు మీరుచేసే వుపకారం యిదేకదూ !

పద్మ : నీపని నాకేం తెలుసురా ? కలలో అయినా అనుకున్నానా ? పైగా నీవెన్నడయినా తాగడం ఎరుగుదువా ?

సుశీల : ఎరగకేం ? మీకొకసారి చెప్పేనుకూడ. మీరుపట్టించుకో లేదు !

మోహన్ : ఇదంతా నీవు చెప్పేవన్నమాట ? చాడీలు చెప్తున్నా వన్నమాట ! నీకెందుకు !

సుశీల : మోహన్ ! ఇది న్యాయంకాదు ! నేను నిజంగా చాడీలు చెప్పాలనుకుంటే ఇంకా ఎన్నో వున్నాయి. తెలుసా ? ఎప్పటి కయినా నీ అంతట నీవే బుద్ధి తెచ్చుకుంటావని యింత వరకు వూరుకున్నాను !

పద్మ : నాకేం అర్థంకావడంలేదు సుసీ ! ఇదంతా తెలిసివు డికూడ ముందుగానే మాకెందుకు చెప్పలేదు?

ప్రసాద్ : ఈ కుట్రలో నీవుగూడా భాగం వుందీ ?

ఇన్‌స్పెక్టర్ : నేను వెళ్ళిన తరవాత మీలో మీరు గర్జుకుంటుయ గాని... ప్రస్తుతం యీ అమ్మాయి ఏం చెప్తాడో వినసీయండి. మీరు మధ్య అడ్డురాకుండా వుంటే చాల సంతోషిస్తాను ! (మోహన్‌తో) ఊఁ ! ఏం జరిగిందండి ?

మోహన్ : (ఇంకా క్రోధంతో సుశీలను) ఇలా దొంగచాడీలు చెప్తావని మొదట్లో తెలిస్తేనా ! !

ఇన్‌స్పెక్టరు : (గద్దిస్తూ) అసలు విషయానికి రండి ! నాకు టైము లేదు. ఆ అమ్మాయిని మొదట ఎప్పుడు కలుసుకున్నారు ?

మోహన్ : (సంకోచిస్తూ) గత ఆగష్టులో కాబోలు !

ఇన్‌స్పెక్టర్ : ఎక్కడ ?

మోహన్ : పేలస్ సినిమాదగ్గర. మా ప్రకాశ్, నేను కలిసి వెళ్లాలనుకున్నాం. రెండు టిక్కెట్లుకొని వాడికోసం చూస్తూ నిలబడ్డాను ! అప్పుడు యీమె కనిపించింది. నన్ను టైము అడిగింది. తను కూడా సినిమా చూడ్డానికి వచ్చిందట. కాని టిక్కెట్టు దొరకలేదట. తరవాత ఏవో మాటలు కలిశాయి.

ఇన్‌స్పెక్టర్ : ఏం మాట్లాడారు ?

మోహన్ : సరిగా జ్ఞాపకంలేదు. కాని తాను అసలు టిక్కెట్టుకోసం రాలేదనిమాత్రం గ్రహించాను.

ఇన్‌స్పెక్టర్ : సరి ?

మోహన్ : ఎవరో తనస్నేహితుడు అక్కడ కలుసుకుంటానని అన్నాడుట. కాని. అంతవరకు రాకపోవడంవల్ల ఏంచేయాలో తెలీక నిలబడ్డదట.

ఇన్‌స్పెక్టర్ : ఊఁ ! తరువాత ?

మోహన్ : నాకు తెలుసు, ఆవిడక్కడికి ఎందుకొచ్చిందో ! 'నాదగ్గర రెండు టిక్కెట్లున్నాయి సినిమాకి వస్తావా' అంటే అంది !

ఇన్‌స్పెక్టర్ : లోపల ఆమేమైనా మాట్లాడిందా ?

మోహన్ : ఏమిమాట్లాడిందో ఏమో...కానీ, ఆవృత్తిలో ఆమె నలిగిన చేయికాదని వెంటనే గ్రహించాను...ఎలాగో త్రోవ తప్పి, యింకేమీ చేయడానికవకాశంలేక యీ వృత్తిలో పడి నట్టని పించింది.

ఇన్‌స్పెక్టర్ : సినిమా అయిపోయింతర్వాత వాళ్ళింటికెళ్ళారు కదూ మీరు ?

మోహన్ : నేనువస్తానంటే మొదట రావద్దన్నది. కాని నేనేబలవంతం చేశాను. రానియ్యకపోతే అక్కడేగొడవచేస్తానని బెదిరించాను.

ఇన్‌స్పెక్టర్ : ఎలాగయితేనేం! ఆరాత్రి ఇంటికి తీసు కెళ్ళిందికదూ?

మోహన్ : తీసుకెళ్ళకతప్పిందికాదు. అదంతా యిప్పుడొక పీడకల అనిపిస్తుంది.

పద్మ : నీకా కాళ్ళెలా గొచ్చాయిరా దానితో వెళ్ళడానికి?

ప్రసాద్ : సుశీ ! మీఅమ్మను లోపలకు తీసుకుపో .

సుశీల : నే – ని – క్క – డే – వుం – టా – ను.

ప్రసాద్ : (కోపంగా) చెప్పింది విన్నావా, లేదా? (భార్యను చూసి లేస్తూ) పద్మా, నీ వెందుకిక్కడ! లోపలికిపో!

[సుశీల, పద్మావతి అయిష్టంగా వెళ్ళిపోతారు]

ఇన్‌స్పెక్టర్ : మళ్ళీ ఆమె నెప్పుడు కలుసుకున్నారు!

మోహన్ : ఒకవారం రోజుల తరవాత.

ఇన్‌స్పెక్టర్ : మీరే పనికట్టుకొని వెళ్ళారా?

మోహన్ : లేదు. ఎలాగోకాని, మళ్ళీ ఆ పేలస్ సినీమా దగ్గరే కలుసుకున్నాం.

ఇన్‌స్పెక్టర్ : ఈసారి సినీమాకు వెళ్ళారా?

మోహన్ : లేదు. తిన్నగా ఇంటికే వెళ్ళాం.

ఇన్‌స్పెక్టర్ : మీరామెను ప్రేమించారా?

మోహన్ : ప్రేమాలేదు, ఏమీలేదు! ఏదోసరదాగా వుండేదంతే!

ప్రసాద్ : ఓరి దుర్మార్గుడా! సరదాకోసం రోజూ దానింటికి వెళ్ళి పడుకునేవాడివా ?

మోహన్ : (కోపంపట్టలేక) ఏం! నాకామాత్రం వయసులేదా ?

ప్రసాద్ : ఏడిచావులే! వెధవ్వి, నోరుముయ్ !

ఇన్‌స్పెక్టర్ : మీరు మళ్లీ అడ్డంవస్తున్నారు. ఈ విచారణకాస్త సవ్యంగా జరగనిస్తారా? లేదా? (మోహన్‌తో) అప్పటి నుండి రోజూ ఆవిడింటికి వెళ్తూవుండేవారుకదూ ?

మోహన్ : అవును, అలా నాలుగైదునెలలు గడిచాయి. తరువాత ఒకనాడు నేను వెళ్లేసరికి మాట్లాడకుండా బాధపడుతూ దిగులుగా కూర్చుంది. ఎప్పుడువెళ్ళినా సరదాగా ఆహ్వానించి. కులాసాగా సంతోషపెట్టేది. ఆవేళ అలావుంటే నాకాశ్చర్యం కలిగింది. ఏమిటని అడిగాను - ఒకంతట చెప్పలేదు. ఏడుస్తూ కూర్చుంది.

ఇన్‌స్పెక్టర్ : ఏం? ఎందుచేత ?

**మోహన్ :** నెల తప్పిందట ! !

ఇన్‌స్పెక్టర్ : ఆ గండం ఎలా గడుస్తుందో, ఏమిచేయాలో మిమ్మల్నడిగిందా ?

మోహన్ : అడిగింది ! కాని నేనేంచెప్పగలను? నాకుమరీ అయోమయంగా వుంది.

ఇన్‌స్పెక్టర్ : మీరిద్దరూ పెళ్ళిచేసేసుకుంటే ఏచికాకూ వుండదని ఎప్పుడూ అనలా ? ఊఁ ?

మోహన్ : లేదు. అసలు పెళ్ళిచేసుకోవడం అసంభవం అని, నేను తనని ప్రేమించడంలేదని తెలుసునట ! ఇంకా ఏమేమో అన్నది.

ఇన్‌స్పెక్టర్ : మరి ఆవిషయం ఎలాపరిష్కరించా లనుకున్నారు ?

మోహన్ : ఎలాపరిష్కరిస్తాం ! జరగవలసిందేదో జరగక తప్పదు అంతవరకూ తనకు రోజులెలా గడుస్తాయన్నదే. సమస్య పాపం ! వీలయినన్నాళ్లు ఏదయినా పనిచేద్దామని వుండే

కాని, ఎవరిస్తారు, కూలిపనితప్ప? అంచేత నేనే నెలకి సరి పోయినంత యిచ్చేవాణ్ణి?

ఇన్స్పెక్టర్ : మొత్తం అంతా ఎంతయిచ్చి వుంటారు? సుమారు...

మోహన్ : సుమారు అయిదారువందలు

ప్రసాద్ : అయిదారు వందలే! నీ సినీమాలు, షికార్లుకాకుండా! ఎక్కడిదిరా నీకంతడబ్బు?

ఇన్స్పెక్టర్ : నేనూ అదే అడగాలనుకుంటున్నాను.

మోహన్ : మనరైతుల దగ్గర తీసుకున్నాను.

ప్రసాద్ : (ఆశ్చర్యంగా) రైతుల దగ్గరా!

మోహన్ : అవును.

ఇన్స్పెక్టర్ : దొంగతనంగానా?

మోహన్ : కాదు లెండి!

ప్రసాద్ : (కోపంతో) కాదూ! దొంగతనం కాకపోతే మరేమిటి?

[ మోహన్ జవాబు చెప్పడు, వెనుక ద్వారం నుంచి సుశీల, పద్మావతి ప్రవేశం]

సుశీల : ఇది నాతప్పేమీకాదు, నాన్నగారూ!

పద్మ : ఒక్కతెను లోపల కూర్చుంటే మనను పరిపరి విధాల పోతుం దండి! నేనుకూడ యిక్కడే వుంటాను...

ప్రసాద్ : (చికాకుగా) ఉండిమాత్రం నువ్వేం చెయ్యగలవ్! మీ శరణాలయానికి సహాయంకోరకు వచ్చిన అమ్మాయి స్థితికి తనే కారణ మని ఒప్పుకున్నాడీ దౌర్భాగ్యుడు! అంతే కాకుండ ప్రతి నెలా ఎవరికీ తెలియకుండ, యిక్కడినుంచి డబ్బు తీసుకవెళ్ళి యిచ్చాడట!

పద్మ : అది చాలక, దొంగతనంగూడ చేశావురా?

మోహన్ : కాదమ్మా, తిరిగి యిచ్చేద్దామనుకున్నాను.

ప్రసాద్ : ఛీ, వెధవ, దొరికిపోయిన దొంగ ఇంకెలాగంటాడు! ఎక్కడినుంచి తెచ్చివ్వాలనుకున్నావ్? మీ తాతదగ్గరనుంచి!

మోహన్ : ఎలాగో ఒకలాగు యిచ్చేయాలనుకున్నాను. నాకప్పుడు డబ్బు అంత అవసరమయింది! అడిగితే మీరు యివ్వరని తెలుసు!

ప్రసాద్ : అసలా అయిదారు వందలూ ఎవరికీ తెలియకుండా ఎలా తీసుకు వెళ్లేవు?

మోహన్ : ఎకౌంటుపుస్తకం చూస్తే మనకు బాకీవున్న రైతులజాబితా దొరికింది. వాళ్ళనడిగి, దబాయిస్తే యిచ్చారు.

ఇన్‌స్పెక్టర్ : సొమ్ముతీసుకుని రశీదు రాసిచ్చేశారా?

మోహన్ : అవును.

ప్రసాద్ : ఛీ ! దుర్మార్గుడా! అవునట. సిగ్గులేదూ? ఆ జాబితా ఏమిటో చెప్పు. ఆలెక్కలన్నీ మళ్ళీ సర్దుకోవాలి. . .ఇంతవరకూ బురదలో కూరుకుపోతూవుంటే, మాతో ఒక్క నాడయినా చెప్పలేదేమిరా?

మోహన్ : మీరది అర్థంచేసుకుని, సహాయపడే మనుష్యులు కారు కాబట్టి!

ప్రసాద్ : నోరుముయ్! పశ్చాదగాడతాను! ... చేతిలో డబ్బుంచుకొని, యిష్టంవచ్చినట్టు లుచ్ఛా వెధవలతో తిరిగి ధ్వంసం అయిపోయావు!

ఇన్‌స్పెక్టర్ : నాకు ఎక్కువ టైములేదు. నేను వెళ్ళిన తరువాత మీ ఇంటి గొడవలు సావకాశంగా చక్కబెట్టుకోండి! యిప్పుడీ విచారణ పూర్తి కావాలి. (మోహన్‌తో) ఆఖరి ప్రశ్న— మీరు తెచ్చిస్తున్న సొమ్ము దొంగసొమ్ముఅని ఆవిడకి తెలిసిపోయిందికదూ?

మోహన్ : (సిగ్గుపడుతూ) అవును, అదే మాపాలిట మోసం అయింది. డబ్బుతీసుకునేదికాదు. నాముఖం చూడననేది.... (హఠాత్తుగా గ్రహించి, తెల్లబోయి) ఇదంతా మీకెలా తెలిసింది? ఆవిడ చెప్పిందా?

ఇన్‌స్పెక్టర్ : నాతో చెప్పలేదు. నే నావిడతో మాట్లాడటానికి మీరు కాస్తయినా ప్రాణం మిగిల్చితేనా!

[అందరికి కోపం వస్తుంది]

మోహన్ : అక్కతో చెప్పిందేమో!

పద్మ : (బెదురుగా) సుశీలా!

సుశీల : ఏం, తప్పేముంది? ఎప్పుడో ఒకప్పుడు తెలుసుకోవలసిందేగా!

మోహన్ : నీతో చెప్పిందా? యిక్కడికి వచ్చిందా? ఎలావస్తుంది? నేనిక్కడ వున్నట్టు తనకు తెలియదు. మరెలా చెప్పింది? (ఎవరూ జవాబు చెప్పరు) ఇప్పుడు చెప్పడానికేం?

ఇన్స్పెక్టర్ : నేనుచెప్తాను వినండి. మీరు డబ్బుని రాకరించినతరవాత మీ అమ్మగారి శరణాలయానికి వెళ్లింది. వైద్యసహాయం కోసం. కాని మీ అమ్మగారు, ఆమె చెప్పినదంతా విని, నానామాటలు అని బయటికి గెంటించేశారు!

మోహన్ : (కోపోద్రేకంతో) అయితే ఆఖరికి నీవు చంపేశా వన్నమాట! నేను దొంగతనం చేస్తున్నానని, నన్ను బాగు చేయడానికి మీ ఆస్పత్రికి వచ్చింది. నీవు చూస్తూ గొంతు కోశావు. ఛీ!

పద్మ : కాదు, మోహన్! ఇలాఅని నాకు తెలియదు. తెలిస్తే గెంటిం చేస్తానా?

మోహన్ : నీకు తెలియదు. ఎందుకు తెలుస్తుంది? తెలుసుకోడా నికి నీజన్మలో ఎన్నడయినా ప్రయత్నిస్తేనా? (కోపంతో పైకి వెడతాడు.)

సుశీల : (బెదరిపోయి) మోహన్! ఆగు!

ప్రసాద్ : ఆరె, దుర్మార్గుడా! మీదిమీదికిపోతున్నావే? పైనకి వెళ్తావా లేదా? చూడు, నిన్నేంచేస్తానో!

ఇన్స్పెక్టర్ : (మధ్య కలుగజేసుకుని కఠినంగా) ఆగండి! (హఠాత్తుగా అందరు తగ్గిపోతారు. అతనివంకే చూస్తూ వుంటారు.) నాకింత కంటె తెలుసుకోవలసిన విషయమేమీ లేదు. సావిత్రేమో చనిపోయింది. మీరందరూ కలిసి ఆమెను వెంటాడి, వేంటాడి

చంపేశారు. ఇదిమాత్రం మరచిపోకండి! (ఒకరి తర్వాత ఒకరిని దీక్షగా చూస్తాడు) ఇంత ఘోరాన్ని మీరుమాత్రం మరిచిపోతారా ?... పద్మావతిగారూ! మీరు సావిత్రికెంత అన్యాయం చేశారో గ్రహించారా? స్త్రీకి, అత్యవసరంగా సహాయం కావలసిన సమయంలో, మీది కన్నకడుపయి వుండికూడ, నిర్దాక్షిణ్యంగా వీధిలోకి గెంటించారు! ఆఖరికి సంఘం పేరుమీద యిచ్చే ఆకాస్త ధర్మాన్నికూడా అంద నివ్వలేదు.... (మోహన్‌తో) మీరేం చేశారో తెలుసా?

మోహన్ : (విషాదంగా) నా జన్మలో మరిచిపోను!

ఇన్‌స్పెక్టర్ : మదించిపోయి, వొళ్ళూ పై తెలియక మీ విలాసం కోసం ఆమె నొక నిషా వస్తువులాగ, వాడుకున్నన్నాళ్ళు వాడు కుని, తరవాత గంగలో విడిచేశారు. ఆతరవాత, ఆమెగతేం కావాలో ఆలోచించారా? (సుశీలవంక తిరుగుతాడు)

సుశీల : (బాధతో) నా ఈర్ష్య, అజ్ఞానంకొద్దీ, నిరపరాధిని ఆమెను పనిలోనుంచి తీయించేశాను! అదే ఆవిడ చావుకు కారణం! ఆ పాపం నాదే! ఎన్నటికీ మరచిపోలేను!

ఇన్‌స్పెక్టర్ : (చాల కటువుగ ప్రసాద్‌వంక తిరిగి) మీరు! దీనంతకీ కారణం! మీ కూలీలకి నాలు గణాలు ఎక్కువ యిమ్మని అడిగినందుకు, మీరు ఆ జోర్డుస్నూలులో నుంచి డిస్మిస్ చేశారు. అనాధని చేశారు! ఆత్మహత్య చేసుకొనేవరకూ మీరంతా కలిసి ఘోరంగా పరాభవించారు! ఇకచూడండి! సావిత్రి తన పగ ఎలాగ తీర్చుకుంటుందో! మీచేత మూడు చెరువుల నీళ్ళు తాగించి, కోర్టుల చుట్టూ తిప్పి, ముప్పుతిప్పలు పెట్టి, ప్రపంచంలో మీకుటుంబం పరువు ప్రతిష్టలు ధ్వంసం చేస్తుంది.

ప్రసాద్ : (ప్రాధేయపడుతూ) ఇన్‌స్పెక్టరుగారూ! నిజమే! మాది అపరాధమే! (రహస్యంగా) మీకెంతకావాలన్నా యిస్తాను. ఇదిమాత్రం బయటికి...

ఇన్‌స్పెక్టర్ : ఎందుకు! లంచాలతో మీఅపరాధాన్ని కప్పిపుచ్చుకోలేరు! (విచారణఅయిపోయింది అన్నట్టు తనచేతిలోని నోటుబుక్కు—కపీమని మూసేసి) మీలో ఎవ్వరూ యీ అఘాయిత్యాన్ని మరిచిపోకండి! మీఅందరిచేతులమీద సావిత్రి వచ్చిరక్తం కనపడుతోంది. ... మీలో ఒక్క—వాసుదేవరావుగారే ఆమెను కొంతప్రేమతో చూసి, కొన్నాళ్ళయినా సంతోష పెట్టారు. ... ఏమయితేనేం! సావిత్రి దారుణ మరణానికి బలి అయిపోయింది. "క్షమించండి! మేమంతా పాపంచేశాం!" అని మీరు పాదాలుపట్టుకోవాలన్నా ప్రాణం మిగల్లేదు.

సుశీల : (దుఃఖమాపుకుంటూ) అవును! వేడుకుంటేక్షమించేదేమో!

ఇన్‌స్పెక్టర్ : సావిత్రి చావు ఒక్కటి మాత్రమే మనకు తెలును! కాని యీ దేశంలో మనచుట్టూ సావిత్రిలాంటి స్త్రీలు, పురుషులు, ఎందరో దారి. తెన్నూలేక అల్లాడిపోతున్నారు. సావిత్రి జీవితంలోను, సావిత్రి మరణంలోను యీ కోటానుకోట్ల, నిర్భాగ్యుల జీవితాలు ప్రతిబింబించాయి! యీఅనాథుల ఆర్తనాదాలు ప్రతిరోజూ దేశమంతటా ప్రతిధ్వనిస్తున్నాయి! మీకు విన్పించడంలేదూ? వాళ్ళ జీవితాలు, ఆశలు, ఆక్రందనాలు, కులాసాగా విలాసాలాడే మీ జీవితాలతో మెలివేసుకొని సన్నిహిత సంబంధంతోవున్నవనే సంగతి మరిచిపోయారు! ఒకరిపట్ల ఒకరికున్న బాధ్యతకూడా, సామాన్య మానవధర్మం గూడా మీరు నెరవేర్చడంలేదు! మీ దోపిడీధనం నిలబెట్టుకోడానికి ప్రజలను ఎంతయినా మోసంచేస్తున్నారు. మీవిశ్వాన్ని, పలుకుబడిని, రేచుకుక్కల్ని చేసి, పైకురికించి ప్రజా వుద్యమాలను, సావిత్రివంటి అమాయికవ్యక్తులనుహతమార్చడం మీకు పరిపాటయిపోయింది! కాని జాగ్రత్త! యికపై యీ వేటసాగదు. ప్రజలు మీమోసాలు, మీదౌర్జన్యాలు గ్రహించారు. వారిఆకలిమంటల్లో లేచే విప్లవజ్వాలలు మీ కెన్ని వేషాలువేసినా, ఎన్నిలోకాలు తిరిగి ఎందరి అండజేరినా,

వెదకి, వెంటాడి బంధించి, అహుతిచేస్తాయి! ఇదిమన యుగ ధర్మం! జ్ఞాపకం ఉంచుకోండి! ... యింతటితో విచారణ అయిపోయిందనుకున్నారేమో! ... ఇంకా వుంది!

(ఒక్కక్షణం వాళ్లందర్నీ పరీక్షగా చూస్తాడు)

నేను మళ్ళీవస్తాను! నమస్తే!

[సూటిగా బయటికి నడిచిపోతాడు. అందరూ నిస్త్రాణగా ఆవైపే చూస్తూ వుంటారు. సుశీల మెల్లగా ఏడుస్తూ వుంటుంది. పద్మావతి ఒక కుర్చీలో కుప్పకూలిపోతుంది. మోహన్ దుఃఖభారంతో రెండుచేతుల మధ్య తలవంచుకుని విచారిస్తుంటాడు. శివరామప్రసాద్ మాత్రం ప్రశాంతుడై వుంటాడు. ఒంకుతూ ద్వారంవద్దకు వెళ్ళితలుపు మూసేస్తాడు, చాల విషాదంగా అందరినీ పరికించి చూస్తాడు. గోడకివున్న అలమరలోనుంచి ఒక గ్లాసు విస్కీ పోసుకుని, గుటుక్కు నమింగేసి, అలమర మూసేస్తాడు.]

ప్రసాద్ : (మోహన్ వంక) దీనంతటికీ నీవే కారణం!

మోహన్ : (నిర్లక్ష్యంగా) అయివుండొచ్చు.

ప్రసాద్ : అయివుండడమేమిటి! ఇదేకాని బయట పడిందంటే, వూరంతా ఒక్కసారి గుప్పుమంటుంది! మన ప్రతిష్ట...

మోహన్ : పరవాలేదులెండి!

ప్రసాద్ : నీకు నేనికీ పరవాలేదు! కాని నాకుంది. (విచారంగా) వచ్చే ఎలక్షనులో తప్పకుండా గెలుస్తామనుకున్నాను!

మోహన్ : మనలో ఇంత కుళ్లున్నప్పుడు ఎలక్షన్లలో గెలిచిమాత్రం ఏం సాధించగలం?

ప్రసాద్ : నీకేం? నీకేమయినా ఖాతరుంటేగా! వెధవ్వి! నీవు ఖర్చుపెట్టిన అయిదారువందలు ఎక్కడనుంచొచ్చాయనుకున్నావ్! అడక్కుండా తిరిగివచ్చేవరకు నీకొక్క దమ్మిడీ యివ్వను! నీ తాగడం, పడుచుపిల్లలతో తిరగడం యిక సాగవు!

పద్మ : ఎంతపనిచేశావురా ? వంశా న్నుద్ధరిస్తావనుకున్నాం ! నిన్ను చూస్తేనే అసహ్యంవేస్తుంది.

మోహన్ : మీరిద్దరూ చేసిన ఘోరం చూస్తే నాకూ అసహ్యం వేస్తుంది. నాకంటే మీరేమీ ఘనకార్యం చేయలేదులెండి!

ప్రసాద్ : నోరుముయ్! మీఅమ్మ, నేనుచేసినదానిలో దోషమేమీ లేదు. దురదృష్టవశాత్తు అదలా చచ్చింది కాని,—

సుశీల : అంతేనా !

ప్రసాద్ : కాకపోతే నీవనేదేమిటి ?

సుశీల : చెపితే మీరర్థం చేసుకోరు ! ఎందుకూ ?

ప్రసాద్ : అయితే చెప్పనక్కరలేదులే, నోరుమూసుకుని కూర్చొంటే చాలు, సంతోషిస్తాం !

సుశీల : ఇప్పటి కప్పుడే అంతా మరిచిపోయి ఏమీ జరగనట్టు నటిస్తారెందుకు, మీరు ?

ప్రసాద్ : జరిగిన దెలాగో జరిగింది. ఇప్పుడు మన వంశానికి కళంకం రాకుండా యీవ్యవహారం ఎలా నడపడంరా దేవుడా అని నేను గోలపెడుతుంటే; నీ విక్కడుండి పెడర్థాలు తీస్తూ కూర్చొంటావా ?

సుశీల : అంతేగాని, సావిత్రి చావుతో మనకు నిమిత్తం లేదన్నమాట! యింత ఘోరం జరగితే దానినుంచి మనం పశ్చాత్తాపపడిం దేమిటి ? నేర్చుకున్న దేమిటి ?

ప్రసాద్ : నేర్చుకోకేం ? చాలా నేర్చుకున్నాం !

మోహన్ : అప్పుడు వాసుకూ నాకు ఏం చెప్పారో జ్ఞాపకముందా? ఏ బెధనయినావచ్చి సంఘంపట్ల మనందరికి బాధ్యత వుంది, సంఘ క్షేమంకోసం అందరూ కృషిచేయాలి అంటే తన్ని తగిలేయ మన్నారు. సరిగ్గా అలాంటివాడే వచ్చి, మనందరిమీద యింటివరకూ అధికారం చలాయిస్తుంటే, వాడి కాపాఠం చెప్పలేదేం?

సుశీల : (ఆలోచిస్తూ) ఇలా అన్నతరవాతేనా ఇన్‌స్పెక్టరు వచ్చాడు
మోహన్ : అవును.
పద్మ : ఏం ! ఎందుకు?
సుశీల : ఏమీలేదు! అంతా వింతగా వుంది. (పరధ్యానంగా ఆలోచిస్తూ వాళ్ళవంక చూస్తూ వుంటుంది)
పద్మ : చాలా విచిత్రంగావుంది! అదే నేనూ ఆలోచిస్తున్నాను.
సుశీల : ఆవచ్చినవ్యక్తి నిజమైన ఇన్‌స్పెక్టరా? అని...ఒక వేళ...
ప్రసాద్ : అవును, పద్మా, దేవుడు మేలుచేసి వాడేకాని అసలు ఇన్‌స్పెక్టర్ కాకపోతే ఇకచూసుకో! జరిగినదంతా ఒకపీడకల అనుకొని మరిచిపోవచ్చు!
సుశీల : ఎలా మరిచిపోతాం? నేనుమాత్రం యీ ఘోరాన్ని మరిచి పోలేను!
పద్మ : (వెగటుగా) ఎన్నాళ్ళవరకు?
సుశీల : ఎప్పటికీ మరిచిపోలేను.
ప్రసాద్ : సరేలే, మరిచిపోకుండ ఒకగోడమీద రాసుకో!
సుశీల : గోడమీదెందుకు? సావిత్రినిమనమంతా వెంటాడి, వెంటాడి చంపిన ఘాతుకం మీ మనస్సుల్లోమాత్రం శిలాక్షరాలతో వ్రాసిలేదూ! ప్రత్యక్షంగా కనబడుతున్న ఈఘోరాన్ని ఎందు కుచులాగ్గా తోసేస్తారు?
ప్రసాద్ : ఇక చాలించు నీ ఉపన్యాసం! యీ వెర్రివాగుడు ఆపక పోతే నీవిక్కడ ఒక్కక్షణం వుండనక్కరలేదు! ఫో లోపలికి!
సుశీల : వెళ్తానులెండి! కాని మనం చేసినదంతా నిజమేఅయితే, మన చేత ఒప్పించినవాడు ఎవడయితేనేం?
మోహన్ : మన ప్రాణాలమీదికి యముడులావచ్చాడు!
సుశీల : అదే నేనూ అంటున్నాను! మోహన్ ! ఆయన ఎవరయితే నేం? ఆయనమాటలు, చేష్టలు అనుమానంగానే వున్నా యనుకో, అయితేనేం?

ప్రసాద్ : నాక్కూడా అదే అనుమానం, మొదటినుంచీ; వాడు ఇన్‌స్పెక్టరా, కాడా అని.

పద్మ : నాకూనూ ! వాడి వైఖరి ఎంతవిపరీతంగా వుందోచూచారా ? కత్తితోనరుకుతున్నట్లు మాట్లాడేవాడు వెధవ !

ప్రసాద్ : ఆఖరికి నాదగ్గరకూడా ఎంత పొగరుబోతుగా మాట్లాడేడో చూచావా: వాడికితెలిసే వుంటుంది నేనుకొన్నాళ్లుడిస్ట్రిక్టుబోర్డు ప్రెసిడెంటునని ! ఈరోజువరకు ఏ ఇన్‌స్పెక్టరయినా నాఎదుట అంతతీవిగా మాట్లాడాడా ? డజన్లమంది ఇన్‌స్పెక్టర్లను చూశాను కాని !......

సుశీల : అతను ఇన్‌స్పెక్టరు కాడేమో !

మోహన్ : కాకపోయినా, యీనాటికి మాత్రం మనపాలిట ధర్మ రాజయ్యాడు !

ప్రసాద్ : భలే, నీనోట ఆధోరణి వినడం చాలా వింతగావుంది. మాఅందరికంటె అసలునీవు ఎక్కువనేరం చేశావు. నీవుదొంగ తనంకూడా ఒప్పుకున్నావు! నీగురించి అంతా అయనకు తెలుసు...మావిషయం అంటావా ? మమ్మల్నివాడేమీ చేయలేడు. కాకపోతే కోర్టుకీడుస్తాడు, అంతే....వాడు నిజంగా ఇన్‌స్పెక్టరే అయితే నీబ్రతుకంతా ధ్వంసం చేసేస్తాడు తెలుసా ! జాగ్రత్త !

సుశీల : (ఆలోచిస్తూ) మనంచెప్పిన విషయాలన్నీ అతనికంతకు ముందు తెలిసినవే ! యిది గమనించారా ?

ప్రసాద్ : ఆఁ ! దానికేమిలే ! అదిరాసిపెట్టిన రెండు మూడు ముక్కల్ని ఆధారంచేసుకుని ఊహాగానంచేశాడు! మన దుర దృష్టవశాత్తు అంతా నిజంఅయింద్మి......కానిమనం యింత చక్కగా అన్నీ అతనికిఒలిచి, ఒలిచి చెప్పకపోతే యింతవరకు వచ్చేదికాదు. మీరందరూ ఎందుకలా వెర్రిగా అన్నీబయట పెట్టేశారో నాకేమీ అర్థం కావడంలేదు !

సుశీల: జరిగిపోయినతర్వాత మీకిప్పుడిలాగే అనిపిస్తుంది. మనలో ఎవరుమాత్రం నిలబడగలిగారు! వొప్పుకోని వాళ్ళెవరు!

పద్మ: నాచేత అతనేమీ చెప్పించలేదు. నాద్యూటీ అనుకుని చేసినదంతా స్వయంగా నేనేచెప్పాను.

ప్రసాద్: మిమ్మల్నందర్నీ అతను దద్దమ్మల్ని చేశాడు

పద్మ: నన్నతనేమీ చెయ్యలేదు!

ప్రసాద్: నిన్నుకాదుపద్మా, వీళ్ళిద్దరూను! మొదటినుంచీవాడికిమన మీద యిష్టంలేదు. ఏసోషలిస్టో, క ్యూనిస్టో అయివుంటాడు! అటువంటి వెధవకి మనం తగినట్టు బుద్ధిచెప్పి పంపించడానికి బదులు, వాడేమనల్ని బుకాయించి మనచేతఅన్నీ ఒప్పించాడు! ఒక్కరయినా ధాటీగా నిలబడతారేమో అనిచూశాను కానీ......

మోహన్: పోనీ, మీరుధాటిగా నిలబడలేక పోయారు?

ప్రసాద్: (గుప్పుమని) నేనెలా నిలబడతాను! అంతకుముందే మీరే అంతా ఒప్పేసుకుంటూవుంటే.... అసలు మీ అందరి ముందు మాట్లాడడమే తప్పు—

సుశీల: అంతసులభంగా లొంగిపోయేవాడా అతను?

పద్మ: మీరిద్దరూ చెప్పినపద్ధతిచూస్తే, అతనికి సహాయంచేయడానికి కూర్చున్నారా అనిపించేది—వట్టిచేతగానిదద్దమ్మలు......ఇక చాలించండి, మీవాగడం! మీనాన్నగారిని కొంత ఆలోచించనీయండి! ఇకమనమేం చెయ్యాలి?

ప్రసాద్: (అయోమయంగా) అవును పద్మా! చేసేదేమిటో త్వరగా చేయాలి.

(వీధితలుపు తీసినశబ్దం. అందరూ ఒకరినొకరు బెదురుతూ చూసుకుంటారు. వాసుదేవరావు ప్రవేశం)

ప్రసాద్: (నిట్టూర్చి) ఓస్, నీవటోయ్! ఇంకెవరో ననుకున్నాం!

వాసు: (త్వరపడుతూ) ఇన్స్పెక్టర్ వెళ్ళి ఎంతసేపయింది?

సుశీల : ఇప్పుడే... అఖరికి మాలో ఒక్కరినయినా విడిచిపెట్టలేదు. అందరినీ ఈ ఊబిలో పీకలవరకుముంచి వెళ్ళాడు. నీవు వెళ్ళి పోయినతరవాత యింకా ఎన్నో ఘోరాలు బయటపడ్డాయి వాసూ !

వాసు : ఏం ఘోరాలు ?
సుశీల : తలచుకుంటే గుండె ఝల్లు మంటుంది.
ప్రసాద్ : దానికేం గాని వాసూ! వాడి ప్రవర్తన చాల విపరీతంగా వుందోయ్.!
పద్మ : చూశావా వాసు ! ఆయనతోగూడా ఎంత మొరటుగ మాట్లాడేడో ! ఎంత అన్యాయం !
వాసు : (ఏదో గ్రహిస్తున్నట్లు) హుఁ, హుఁ, హుఁ...

[అంగరూ వాసువంక ప్రశ్నార్థకంగా చూస్తారు]

ప్రసాద్ : నీకేదో తెలిసినట్టుందే ! ఏమిటది ?
వాసు : అతను పోలీసు ఇన్స్పెక్టరు కాదు.

[అందరికీ ఒక్కసారి ఆశ్చర్యం, సంతోషం.]

ప్రసాద్ : ఏమిటీ !
పద్మ : నిజమే !
వాసు : నిజమే. అది చెప్పడానికే వచ్చాను.
ప్రసాద్ : ఎక్కడయినా వాకబుచేశావా ? ఎవరిని ?
వాసు : నాకు బాగా తెలిసిన ఒక ఇన్స్పెక్టరు కనబడితే ఇతని సంగతి అడిగాను ! అలాంటి ఆఫీసరు యీ ఠాణాలో ఎక్కడా లే డన్నాడు !
ప్రసాద్ : కొంపతీసి ఇక్కడి సంగతు లేవయినా ?...
వాసు : అబ్బెబ్బె, నే నంత వెర్రి వాడినా... అసలు సంగ తేమి టంటే, అటువంటి ఇన్స్పెక్టరు యీ సర్కిలులోనే లేడట!
ప్రసాద్ : అయితే వీ డెవరంటావ్ ?
వాసు : ఎవడో రౌడీ వెధవ, అంతే !

ప్రసాద్: (విజయవంతంగా) నేను చెప్పలేదూ! మనదగ్గిర అంతధీమాగా మాట్లాడే ఇన్‌స్పెక్టర్ ఎవడైనా యీ జిల్లాలో వుండగలడా?

వాసు: మనందర్నీ బుట్టలో వేశాడు.

ప్రసాద్: (లేచి) సరే, ఇదికూడా నిర్ధారణచేసుకుందాం వుండండి!

పద్మ: ఏంచేస్తారు?

ప్రసాద్: పోలీస్‌స్టేషన్‌కి టెలిఫోన్ చేస్తాను!

పద్మ: జాగ్రతగా మాట్లాడండేం?

ప్రసాద్: (టెలిఫోన్‌వద్ద) నీవేమీ భయపడనక్కరలేదు! త్రీ, ఫోర్, సెవెన్, టు, ప్లీస్ (నంబరువచ్చేలోపల) నాకు మొదటినుంచీ అనుమానంగానేవుంది. స్టేషన్‌కి ఫోన్‌చేసి కనుక్కోవాలనే అనుకుంటున్నాను. ఆఁ! హెల్లో! పోలీస్‌స్టేషన్? ఎవరది? ఆహాఁ! నేను శివరామప్రసాద్‌ని! ఆఁ! చూడండి,...... అక్కడ మనస్టేషన్‌లో, రంగారావుఅనే ఇన్‌స్పెక్టరున్నారా? లేరూ? ఈమధ్యనే యిక్కడికి ట్రాన్స్‌ఫర్ అయివచ్చారట? అలాంటి ఆఫీసరేలేడా? సరే, మంచిది. థ్యాంక్స్! (టెలిఫోన్ పెట్టేసి) విన్నారా? వాడు ఇన్‌స్పెక్టరూకాడు, ఇమిటేషన్ ఇన్‌స్పెక్టరూ కాడు!

పద్మ: నేను అనుకుంటూనే వున్నాను.

ప్రసాద్: అంతా మబ్బులా తేలిపోయింది చూశారా! అంతా వట్టి బూటకం!

సుశీల: (నవ్వడానికిప్రయత్నిస్తూ) ఇంక యిప్పటినుంచీ మళ్ళీమనం దరం పెద్దమనుషులం అయిపోయాం కదూ?

ప్రసాద్: నీవు నోరుమూసుకుని కూర్చోలేవూ?

మోహన్: ఏం? తప్పేముంది?

ప్రసాద్: అతనేకాని నిజమయిన ఇన్‌స్పెక్టరయితే, వాడిరంగు బయట పెట్టేవాణ్ణి!

పద్మ: పోనిద్దురూ! పీడపోయింది!

సుశీల : (వాసుతో) మీరు వెళ్ళిపోయినతరువాత ఏంజరిగిందో వినవలసింది.

వాసు : అక్కరలేదులే, నాకవసరం! (ప్రసాద్‌తో) అయితే, యీ నాటకమంతా ఏమిటి? అంతా బూటకమేనా?

ప్రసాద్ : లేకపోతే! ఎవరో వెధవలు వీడిని పంపించివుంటారు. దబాయించి మనలోటుపాట్లు తెలుసుకుని ప్రచారంచేయడానికి. ముఖ్యంగా ఎలక్షనురోజులు వస్తున్నాయిగదూ! వెధవలు యిప్పటినుంచే జాగ్రత్తపడుతున్నారు...అసలు మొదట్లోనే మనం కళ్లు తెరుచుకోవలసింది! నేనయితే జాగ్రతపడేవాడినే! కాని అలా అందరం కులాసాగా కబుర్లు చెప్పుకుంటూవుంటే అకస్మాత్తుగవచ్చి బుకాయించేసరికి...

పద్మ : అసలు మొదట్లో నేనేవుంటే నిలబెట్టి అడిగేదాన్ని! దానితో బయటపడేది బండారం!

సుశీల : ఇప్పుడు చెప్పడానికి బాగానేవుంటాయి కబుర్లు!

పద్మ ; ఏం, అలాచేయలేననా? మనందరిలోనూ నేనే వాడివలలో పడకుండా నిలబడగలిగాను! అదంతా ఎందుకులే యిప్పుడు!

ప్రసాద్ : ఇప్పటికి అసలు విషయం కనిపెట్టేము. వాడు బూటకపు మనిషి, దగుల్బాజీ, మోసగాడు!

వాసు : ఇంతటితో తీరిపోలేదు. ఇంకావుందీకథ.

ప్రసాద్ : అయితే వాడి అంతు కనుక్కోగలమంటారా? సరే, కానీయండి! మోహన్! రా, కూర్చో! విను!

మోహన్ : (కొంచెం పక్కగా నిలబడిన చోటునుంచే) ఇక్కడ బాగానే వుందిలెండి!

ప్రసాద్ ! ఏమిట్రా బాగుండడం? ఎందుకలా దూరంగా నిలబడతావ్? నీకేమీ సంబంధం లేనట్టు — ఈ వ్యవహారం ఎవరి పీకల మీదికి వొచ్చిందిప్పుడు? నీకేగా! కొంచెం ఒంటిమీద తెలివి తెచ్చుకుని సరిగా ప్రవర్తించు!

మోహన్ : (వెగటుగా) వింటున్నాను లెండి!

ప్రసాద్ : (స్థిమిత పడుతూ) మీ యిద్దరికీ మనసు స్థిమితంగా లేక పోతే, యిది మాకు విడిచేసి పొండి... వాడి దుండగం వల్ల అందరం దెబ్బతిన్నాం! ఇప్పుడు వాడి నిజ స్వరూపం తెలిసిందిగదా? ఇంకా కొంచెం జాగ్రతగా ఆలోచిస్తే వాడిని బుట్టలో వేసెయ్యొచ్చు!

సుశీల : ఏమి సాధించడానికి లెండి!

పద్మ : నీ పిచ్చిమాటలు కట్టిపెట్టమని ఎన్నోసార్లు చెప్పాం! ఏమిటీ వీళ్ళింత తెలివిమాలిన వాళ్ళయిపోతున్నారు!

మోహన్ : ఇంతమంది తెలివితోనూ ఏమి సాధిస్తాంమనం? ఆచచ్చి పోయిన సావిత్రిని బ్రతికించగలమా?

సుశీల : అదేమోహన్! వీళ్ళెవ్వరూ ఆవిషయం గ్రహించరు!

మోహన్ : ఆ వచ్చినతను ఎవరయితే నేం! నేను చేసిన ఘోరం నేను చేశాను! అమ్మ చేసిన అపచారం అమ్మ చేసింది. మ నందరంకూడా సావిత్రిపట్ల అపరాధులమే! మనందరమూ శిక్షార్హులమే!

వాసు : అయితే నీవనే దేమిటోయ్!

సుశీల : అదికాదు వాసూ! నీవు వెళ్లిపోయినతరవాత జరిగినదంతా తెలిస్తేనే కాని నీకు బోధపడదు, విను చెవుతాను. ఆ అమ్మాయి చచ్చి పోయే టప్పటికి ఎనిమిదో నెల గర్భం! దానికి [illegible]న మోహనే కారణం. అంతేకాదు దొంగతనంగా డబ్బు తీసుకుని ప్రతినెలా ఆవిడ కిస్తుండేవాడట...

ప్రసాద్ : అదంతా యిప్పుడెందుకు?

సుశీల : ఏం! ఆయ[illegible]నకికూడ యీకథ తెలియనివ్వండి...అసలాడబ్బు కాదు వాసూ, సావిత్రికి జరిగినఘోరం ముఖ్యం! ఆమె ఆత్మహత్య చేసుకోడానికి మనంకదా కారణం! అదెలామరిచి పోగలం? ఆశవంయింకా పూర్తిగా చల్లబడనేలేదు గదా! మీరిక్కడకూర్చుని చదరంగపు ఎత్తులు వేస్తుంటే, హృదయ మున్న ఎవరి[illegible]యినా ఎలావుంటుంది చెప్పండి?

ప్రసాద్ : (విసుగెత్తి) మీకుపుణ్యం వుంటుంది వూరుకుందురూ ?
పద్మ : వీళ్ళింత అరాజకంగా తయారయ్యారేమిటి ?
ప్రసాద్ : నాకంతకంతకీ ఒళ్లు మండిపోతోంది. మీ మాటలు వింటూంటే ! యీ మాత్రం గ్రహించలేరూ ? మనం ఏ జాగ్రత్తాపడకపోతే, వూళ్లో ప్రతివాడు మనమీద కత్తికడతాడు ! పైగా ఎలక్షన్లు దగ్గరకొచ్చేస్తున్నాయి !
మోహన్ : దగ్గరకిరానీండి ! ఏనాటికైనా మనపాపాలకి ప్రతిఫలం అనుభవించక తప్పదు.
ప్రసాద్ : (ఉగ్రుడయి) నోరుముయ్ ! లేకపోతే బయటికిపో ! ఇంకే తండ్రిఅయినాసరే, నిన్నీపాటికి యింటినుంచి గెంటించేసేవాడు, తెలుసా ! జాగ్రత్త !
సుశీల : (కలవరపడుతూ) సావిత్రిని మనమే చంపేశాము !
వాసు : నిజంగా మనమే చంపేశామూ ?
మోహన్ : కాకపోతే......
సుశీల : (వ్యంగ్యంగా) బహుశా మీరు ప్రేమలతను వుంచుకోలేదని కూడా చెపుతారు కాబోలు !
వాసు : అదినేనే ఒప్పుకున్నానుగదా ! సుసీ, క్షమించు ! తప్పయిపోయింది.
సుశీల : మాఅందరికంటే నీవేనయం ! ఇన్స్పెక్టర్ గారుకూడా అలాగే అన్నారు.
ప్రసాద్ : (గద్దిస్తూ) వాడుఇన్స్పెక్టర్ కాడని చెప్పాను !
సుశీల : ఈ వేళకిమాత్రం ఆయన మనకు ఇన్స్పెక్టరే !
వాసు : అంతా అబద్ధం! ఆయన ఇన్స్పెక్టరేఅనడం ఎంతనిజమో సావిత్రిని మనంచంపేశా మనడంకూడ అంతేనిజం !
సుశీల : మీరిప్పుడు అదంతా జరగలేదని రుజువు చేస్తారు కాబోలు !
వాసు : తప్పకుండ చేస్తాను, వినండి! (తాపీగామాట్లాడుతాడు) మనం విందుచేసుకుంటూవుంటే ఒకడులోపలికివచ్చాడు. తనుపోలీస్ ఇన్స్పెక్టరు నన్నాడు ! అదివట్టిఅబద్ధం? వచ్చిఏంచేశాడు ? అక్కడక్కడ విన్న విషయాలన్నీ చాలనేర్పుగా వూసగుచ్చి,

మనందరం, ఒక అమ్మాయిచావుకు కారణం అని ఒప్పించి నాటకమాడాడు.

మోహన్ : (వెగటుగా) మీరుకాదంటారు !

వాసు : ఈకథలో మొదటినుంచి చివరివరకు వరుసగా కష్టాలుపడేది, ఆఒక్క అమ్మాయే అని మనకెలా తెలుసు ?

ప్రసాద్ : (కుతూహలంగా) అవునోయ్, నిజమే !

మోహన్ : మనమే ఒప్పుకున్నాంగా !

వాసు : నిజమే కాని ఏమనిఒప్పుకున్నాం ? మనలో ప్రతివారికీ ఎవరో ఒకమ్మాయితో సంబంధంవున్నట్టు ఒప్పుకున్నాం ! అవునా ? కాని, మనందరం ఆ ఒక్కమ్మాయినే వెంటాడిచంపినట్టు రుజువేమిటి ? (విజయవంతంగా అందరినీచూస్తాడు. తరువాత శివరామప్రసాద్‌తో) పోనీ, మీసంగతి ఆలోచించండి ! మీరు సావిత్రి అన్న ఆమెను పనిలోనుంచి తీయించేశారు. మీరా సంగతే మరిచిపోయారు. కాని ఆయనవచ్చి మీకొకఫోటో చూపిస్తాడు. అప్పుడుమీకు జ్ఞాపకంవస్తుంది; అఫోటో పోల్చుకుంటారు, అవునా ?

ప్రసాద్ : అవును. ఇదంతా సరిగ్గానేవుంది, ఆతరువాత ?

వాసు : తరువాత; గార్‌ప్రకాశరావుగారింట్లో ఒక దాదీని సుశీల పనిలోనుంచి తీయించేసినట్టు వాడికెలాగో తెలిసింది ! ఈవిడ, ఆ మొదటి అమ్మాయే అంటాడు. ఒకఫోటో చూపిస్తాడు. సుశీల పోల్చుకుంటుంది.

సుశీల : అవును, అది ఆవిడ ఫోటోయే !

వాసు : నిజమేకాని — నీవు చూచినఫోటో, మీనాన్నగారు పనిలోనుంచి తీసేసిన సావిత్రిదే అని ఎలా తెలుసు ? సావిత్రినిఎన్నడయిన చూచావా ?

సుశీల : అదికాదూ ?...

వాసు : నీవు చూచినఫోటో మీనాన్నగారు చూడలేదు. ఆరెండూ ఒకటేనా ? జ్ఞాపకం తెచ్చుకో !

సుశీల : ఆరెండూ వేరువేరు ఫోటోలనుకుంటాను...

వాసు : అంచేత వాళ్లిద్దరూ ఒక్కరే అని ఎలా అనుకోగలం ?

సుశీల : ఆఁ ! నీవు చెప్పేది ఇప్పుడర్థమయింది.

వాసు : ఈ ఫోటోలన్నీ ఒక్క అమ్మాయివి కావు...వినండి, యింకా చెవుతాను ! నాకాయన ఏ ఫోటో చూపించలేదు. జ్ఞాపకం వుందా ? ఆఅమ్మాయి, తన పేరు ప్రేమలత అని మార్చుకుంది అనిమాత్రం చెప్పేడు. అది విని నేను కొంచెం ఖంగారుపడగానే నన్ను పట్టుకున్నాడు. నేనంతసులభంగా లొంగకపోయివుందును. కాని, నిజంగా, ప్రేమలత అన్న ఒకామె నాకు బాగా తెలుసు.

ప్రసాద్ : అవును. యీ ప్రేమలత ఆ సావిత్రే అనడానికి ఏమిటాధారం ? వాసు చెప్పినమాటలు తప్ప ! అందులో యెంత నిజమున్నదో మన కిప్పుడే తెలుసు; అందుచేత, వాడు మొదటనుంచి అలానే అబద్ధాలతో బుకాయిస్తూ వచ్చాడన్నమాట !

వాసు : అవును !......నేనువెళ్ళిపోయిన తరవాత ఏంజరిగింది ?

పద్మ : మోహన్ బయటికివెళ్ళిన దగ్గరనుంచినామనసు గాభరాగానే వుంది. వాడివంట్లో ఎలావుందోనని...దానికితోడు ఆవైధవ, 'మోహన్ గూడ ఇక్కడ అవసరం' అనడంతోనే నాఖంగారు ఎక్కువయింది. అకస్మాత్తుగావచ్చి నేను సావిత్రిని ఒకవారం క్రితంచూచాను అన్నాడు.

ప్రసాద్ : అంటే...అడగకముందే అన్నాడు ?

పద్మ : వెర్రిదానిలాగ నేనుఅవునన్నాను.

ప్రసాద్ : అసలు నీవలా ఎందుకొప్పుకున్నావో నాకర్థం కావడం లేదు. నీదగ్గరకొచ్చినప్పుడు సావిత్రిఅన్న పేరున రాలేదుకదా ?

సుశీల : ఏమి ? ఆ అమ్మాయి ఫోటో పోల్చుకున్నావుకదూ ?

వాసు : ఆ ఫోటో ఇంకెవరికయినా చూపించాడా?

పద్మ : లేదు. నేనుమాత్రం చూశాను.

వాసు : చూచారా ? ఇప్పటికికూడ యీ కథలో మొదటినుంచి చివరివరకు ఒకఅమ్మాయే ఉందనడానికి ఆధారం

మీ ఆస్పత్రికి వచ్చిన ఏదో ఒక అమ్మాయి ఫోటో చూపించి వుంటాడు; మీరు పోల్చుకుని వుంటారు—అంతేకాని, ఆ ఫోటో సావిత్రిదే అనడానికి ఏమిటి రుజువు? మీ ముగ్గురికి మూడు ఫోటోలు చూపించాడన్నమాట!

ప్రసాద్ : నిజమే. వాసూ! మనందరికీ వేరు వేరు ఫోటోలు చూపించి వుంటాడు! మనం పోల్చుకుని వుంటాము! మన కుటుంబానికి తెలిసినవాళ్ళ ఫోటోలన్నీ ఎలా సంపాదించాడో! స్కౌండ్రెల్!

వాసు : మోహన్, నీకు కూడా ఫోటో చూపించాడా?

మోహన్ : నా దగ్గరికి వచ్చేసరికి ఫోటో అవసరమే లేకపోయింది. అమ్మ దగ్గరకు వెళ్ళిన అమ్మాయి, నాకు పేలస్ సినీమాలో పరిచయమయిన అమ్మాయే అయివుంటుంది గదా?

వాసు : ఏం? ఎలా తెలుసు?

మోహన్ : అమ్మతో చెప్పిందంట. తనకు నేనిస్తూవున్న దొంగ సొమ్ము తీసుకోలేక అలా సహాయానికి వచ్చానని ... నాతో కూడా అలాగే అన్నది!

వాసు : అయినప్పటికీ అదంతా వట్టిబూటకమే!

మోహన్ : నాకిందులో బూటకమేమీ కనబడటం లేదు. మీరందరూ యీ కేసులోనుంచి తప్పించుకోవాలనుకుంటున్నారేమో! ఏమి చేసినాసరే, అమ్మ, నేను తప్పించుకోలేము. మా చేతులనిండా ఆవిడ రక్తం కనబడుతూనే వుంది. మేమే ఆ హత్యకు కారకులం!

ప్రసాద్ : ఆపవోయ్ నీ వాగుడు! నీ వొక్కడివయితే గంగలో కలిసిపోయినా పరవాలేదు. కాని యిప్పుడు మన వంశప్రతిష్ట నిలబెట్టుకోవాలి!

మోహన్ : ఏమయినాసరే, ఆ అమ్మాయి చచ్చిపోవడం నిజం అంటారా? కాదా?

వాసు : ఏ అమ్మాయి? యిందులో నలుగురయిదుగురు వున్నారు.

మో : ఎంతమందుంటే ఏం? ఆ అమ్మాయి మాత్రం చచ్చిపోయింది!

వాసు : మన కెలా తెలుసు ఆమె చచ్చిపోయినట్టు ?

[అందరిలోనూ ఆశ్చర్యం ! సంతోషం]

పద్మ : అవునండోయ్ ! మనకెం తెలుస ? అదీ వాడు చెప్పిందే !

ప్రసాద్ : చెప్పండి చూద్దాం ! అసలువాడెలా బుకాయించగలిగేడో చెవుతాను వినండి. మనందరం కులాసాగా కబుర్లాడుతూ పార్టీ చేసుకుంటున్నాం. అప్పుడు వాడు వచ్చాడు. మనల్ని ఎలాగయినా నమ్మించి మోసంచేయాలి. ఏంచేశాడు ? వచ్చీ రావడంతోనే, ఒక ఏటంబాంబువిశిరాడు. దాంతో మనంద రిలో ఖంగారు పుట్టింది ! ఇక తన యిష్టంవచ్చినట్టు ఛలా యించాడు. చూచారా ఆధాటీ ! ఆనిబ్బరం ! (ఇన్స్పెక్టగును వెక్కిరిస్తూ) 'యీవేళ ఓఅమ్మాయి ఆత్మహత్య చేసుకుంది, ఏసిడ్ తాగేసింది. యమబాధపడింది. కడుపులో పేగులు పూర్తిగా కాలి, మసి అయిపోయాయి.'

సుశీల ; మళ్లీ ఆఘోరాన్ని వర్ణించకండి నాన్నగారూ, మీకు పుణ్యా ముంటుంది !

ప్రసాద్ : అదంతా మరొకసారి వర్ణించితేనే మీకు భయంపుడు తోంది ! సరిగ్గా ఇదేవాడుచేశాడు ! ఒక్కసారి విదిల్చించి, తరువాత తనయిష్టం వచ్చినట్టు దబాయించాడు ! ... కాని మహాతెలివిగా నడిపించాడోయ్ కథ !

వాసు : ఇదేకాని మొదటే తెలిసివుంటేనా !

సుశీల ! అయితే ఆ ఆత్మహత్య జరగలేదన్నమాట.

వాసు : అదీకూడ యిప్పుడే తెలిసిపోతుంది కదూ !

సుశీల : ఎలాగ ?

వాసు : ఆస్పత్రికి ఫోన్ చెయ్యండి ! పిలవండి !

ప్రసాద్ : యింతరాత్రప్పుడు ఫోన్ చేయుడం బాగుంటుందా ?

వాసు : (ఫోన్లో) భయంలేదు. త్రీ, ఫోర్, వన్, ప్లీస్...... గవర్నమెంటు హాస్పిటల్ - కాషుయాల్టీవార్డేనా ? ...... ఆఁ! వాసు దేవరావు !... ఈవేళ మధ్యాహ్నం మీఆస్పత్రికి ఏసిడ్ తాగేసిన ఒక అమ్మాయిని తీసుకొచ్చారా ?...

తరవాత చనిపోయిందట ?... ఆఁ! ఈ వేళే ?... సరే, వుంటాను. థాంక్స్యూ !

[ ఫోన్ చేస్తున్నంతసేపూ అందరూ నిశ్శబ్దంగా, దిగాలుగా వుంటారు. శివరామప్రసాద్ నుదుటి చెమట తుడుచుకుంటాడు. మోహన్ పిడికిళ్ళు మూస్తూ తెరుస్తూ వుంటాడు ]

వాసు : లేదూ? సరిగ్గా కనుక్కున్నారా? థ్యాంక్స్ (టెలిఫోన్ పెట్టేసి) ఈ వేళ అటువంటి కేసే రాలేదుట. (పెద్దగా నవ్వుతూ) అసలు ఆత్మహత్య కేసులు నెలరోజులనుంచి లేనేలేవట !

ప్రసాద్ : (విజయవంతంగ) చూశావా ? ఆకాస్తకూడ ఉప్పున తేలిపోయింది ! ఇదంతా మొదటినుంచి చివరివరకూ వట్టి మోసం! దగా ! (ప్రమాదం తప్పిన్నట్లు ఒక పెద్దనిట్టూర్పువిడిచి) ఇంత చులాగ్గా ఆవెధవకి అమ్ముడుబోవడం వుందే, చాలసిగ్గుచేటు... కాని, వాసూ, కేసుమహా అద్భుతంగ నడిపేడోయ్.

వాసు : బయటికి వెళ్లిన తరవాత, కొంత చల్లబడి సావధానంగా ఆలోచించాను. ఏమిటిరా సంగతీ. అని...

పద్మ : మన వాసు వుందే! ఎలాగైనా తెలివిగలవాడు !

[ అందరూ సంతోషంగా నవ్వుతారు. ]

ప్రసాద్ : కాని మేము పడినంత గాభరా మీకు లేదు. అందుకే అలా సావధానంగా ఆలోచించగలిగావు. నిజంగా నాకెంత భయం వేసిందో తెలుసా ? యీ కథే కాని పేపర్లకెక్కిందంటే యింకేమయినా వుందా ? అందులో ఎలక్షన్.రోజులొస్తున్నాయి !

సుశీల : కాని, నాన్నగారూ ! ఆవిడ చచ్చిపోవడం తప్ప మనం ఒప్పుకున్నదంతా నిజంగా జరిగిందే కదూ !

ప్రసాద్ : ఓసి, వెర్రిదానా! ఆ కథంతా యిప్పుడడ్డం తిరిగిందే! (ఇన్‌స్పెక్టర్‌ని వెక్కిరిస్తూ) 'మీరందరూకలిసి ఆమెను చంపేశారు— ఆ బాధ్యతమీది. సావిత్రిని ఒక్కతెనేకాదు, మీరు కోటాను కోట్ల ప్రజలను చంపేస్తున్నారు, మనల్ని అడవి మనుష్యు లనుకున్నాడు కాబోలు ! (సుశీల, మోహన్ లవంక

(...ంకితనంగా నవ్వుతాడు) వాడలా అంటూవుంటే మీ మొఖా
లు ఫోటో తీయవలసింది— పట్టి వైరిబాగుల వాళ్లు మీరు.
[ సుశీల లేచి వెళ్ళిపోవడానికి ద్వారంవేపు నడుస్తుంది. ]

పద్మ : పోయి పడుకుంటావా సుశీ ?

సుశీల : యిక్కడ నే నుండలేను. మీ మాటలు వింటూంటే నా మనస్సు కోత పెట్టినట్టుంది.

ప్రసాద్ : ఎందుకు బాధ ? మంచిదానివే, రా, కూర్చో !

పద్మ : నామాటవిని వాసుకిచ్చేసిన వుంగరం మళ్ళీతీసుకో !

సుశీల : (ఉద్రేకంతో) యింతవరకు పైకుబుకిన ఆభయంకర జీవితాన్ని యింతత్వరగా, తేలికగా మరిచిపోతారేం ?

ప్రసాద్ : ఏంజీవితం ? ఏమీజరగలేదు! ఇప్పుడు తెలుసుకొన్నదేమిటి ?

సుశీల : అంతేనా ! ఇంకేమీ లేదూ ? మనం విచారించడానికిగాని, నేర్చుకోడానికిగాని, ఏమీలేదూ ? మళ్ళీ మనగౌరవ మర్యాదలు, హోదాలుఅన్నీ ముఖాలకు తగిలించుకొని సంఘంమీద అధికారం చలాయించ వచ్చునన్నమాట.

పద్మ : (కటువుగా)నీవనేదేమిటో ఎవ్వరికీ బోధపడలేదు.

మోహన్ : నాకర్థమౌతోందిలెండి ?

సుశీల : ఆయనెవరయినాసరే ! మనందరం ఆఅమ్మాయికి చేసిన అన్యాయం మరుపు రాకుండాచేశాడు! ఆయనున్నంత సేపూ మీరు యిదిమనసుకు పట్టించుకున్నట్టే కనపడ్డారు. బాధతో క్రుంగిపోయినట్టే నటించారు! ఆయన వెళ్ళిపోగానే అంతా మరిచిపోతున్నారు. మళ్ళీ మీపాత వేషాలు వేసుకున్నారు అమాయకుల్లాగా !

పద్మ (వెక్కిరింతగా) ఏం ? మీయిద్దరికీ ఏదో పూనినట్లుంది !

మోహన్ : నేనుమాత్రం యికఈ వేషాలు వెయ్యలేను...ఆ మహానుభావుడు* చెప్పిన యుగధర్మంనాకు. బాగా జ్ఞాపకంవుంది ! ఈదార్జన్యం, పరన్యాయం, ఆకలిబాధలు, ఆర్తనాదాల్తూ... యివన్నీ మన సంఘంలో వున్నంతకాలం... యీదోపిడి,

పీడనలోనుంచి పుట్టిన విప్లవాగ్నులు నాకుఅప్పుడే కనబడు తున్నాయిమనచుట్టూ,.....

సుశీ : గొప్పసత్యం పలికావు మోహన్ !

ప్రసాద్ : చాలించండి! పిచ్చివాళ్ళ లాగ వాగకుండా పోయి పడు కోండి?

పద్మ : ఈగొడవల వల్ల అలిసిపోయి వాళ్లేం మాట్లాడుతున్నారో వాళ్లకే తెలియడంలేదు! కొంచెంసేపు నిద్రపోతే వాళ్లే సురిచి పోతారు!

వాసు : సుసీ! అనవసరంగా నీవలా వుద్రేకపడవద్దు. తెల్లవారేసరికి అన్నీ సమసి పోతాయి! ఇదిగో... చూడు... నామాట విని యీవుంగరం వేలికి పెట్టనీ?

సుశీల : వద్దు! ఇప్పుడు నేనా మోహించలేను. ఆలోచించి చెపుతాను!

ప్రసాద్ : (మోహన్, సుశీలవంక చూపుతూ) చూడండి, యీకొత్త తరం మనుషులు! ఎంత ధైర్యవంతులో! భారత దేశాన్ని వుద్ధరించేవాళ్ళు వీళ్ళేనట. దేశ సౌభాగ్యం వీళ్ళవల్లనే కలుగు తుందట ! వెర్రి మనుషులు ! ఈమాత్రం మోసాన్నిగూడా ఎదిరించలేరు ! వట్టి పిరికి గుండెలు!— ఎందుకు పనికివస్తారు!

[టెలిఫోన్ మ్రోగుతుంది. ఒక్క క్షణం గాఢమైన నిశ్శబ్దం. శివరామ ప్రసాద్ టెలిఫోన్ దగ్గరకు వెడతాడు.]

ప్రసాద్ : ఆఁ, అవును! శివరామప్రసాద్ ! ఆ? ఆ? ఏమిటీ? ఎప్పుడూ? ఆ! యిప్పుడేనా? సరే (ఫోన్ క్రిందపెట్టేసి కల వరంతో, భయంతో చూస్తాడు. ముఖంనిండా చెమట. దిగు లుగా ముందుకువచ్చి) పోలీస్ స్టేషన్ నుంచి! ఒకఅమ్మాయి ఆత్మహత్య చేసుకుందట...ఏసిడ్ తాగేసి...ఒక్కఅరగంటలో పోలీసు వాళ్ళిక్కడికి వస్తారట ఎందుకో!

[అందరూ బెదిరిపోయి పేలవంగా నిశ్శబ్దగావుంటారు. మళ్ళీ భయంకర వాతావరణం ఆవరిస్తుంది]

[ తెర ]

